# వృషనామ సంవత్సర — ఆశ్వయుజ - కార్తీకమాసములు

1941-వ సం॥ అక్టోబరు నెల

| | | |
|---|---|---|
| 1 | బు | ఏ మ12-15 శ్ర ఉ7-2 పవ11-1ల12-37వ మతత్రయ ఏకాదశి పదు11-25 |
| 2 | గు | ద్వా ప11-35 ధని ఉ6-57 మవ2-16ల3-54వ ఉదు9-49 తిరి దు2-35 |
| 3 | శు | త్ర ప11-25 శత ఉ7-20 మవ1-59ల3-43వ ఉదు8-14 మదు12-12 |
| 4 | శ | చ ప11-46 పూభా ఉ8-18 సావ6-27ల8-9వ పూర్ణిమతిథి ఉదు7-27వ [సాదు4-7 |
| 5 | ఆ | ○ పూర్ణి మ12-37 ఉభా ఉ9-38రావ10-36ల12-19వ దినం29-35 పాడ్యమీతిథి |
| 6 | సో | బపా మ1-56 రేవ ప11-29 వర్జ్యములేదు శూన్యతిథి పదు12-10తిరి దు2-33ల [10-37 |
| 7 | మం | వి మ3-40అశ్వ మ1-43ఉవ9-21ల11-6వ రావ12-21ల2-7వవిదియతిథిఉదు8-15 రాదు |
| 8 | బు | త సా5-33 భర సా4-11 తెవ5-33లపదు11-22ల |
| 9 | గు | చ రా7-45 కృ సా6-49 ఉశేవ7-15వ ఉదు9-49 మదు2-31వ |
| 10 | శు | పం రా9-37 రో రా9-23 మవ12-31ల2-13వ రావ3-36ల5-18వ |
| 11 | శ | ష రా11-39 మృ రా11-47 వర్జ్యములేదు దినం 29-21 ఉదు7-26వ |
| 12 | ఆ | స రా1-6 ఆర్ద్ర రా1-47 ఉవ8-52ల10-36వ సాదు4-2ల |
| 13 | సో | అ రా2-22 పున రా3-26 మవ2-37ల4-19వ పదు12-9 తిరి దు2-29 |
| 14 | మం | న రా2-42 పుష్య తె4-30 పవ11-47ల1-27వ ఉదు8-14 రాదు10-35ల |
| 15 | బు | ద రా2-45 ఆశ్రే తె5-9 రావ5-42ల7-21వ పదు11-21ల [మదు2-27 |
| 16 | గు | ఏ రా2-11 మఘ తె5-12సావ5-10ల6-46వదినం29-6 మతత్రయఏకాదశి ఉదు9-47 |
| 17 | శు | ద్వా రా1-15 పూఫ తె4-53 మవ1-6ల2-42వ ఉదు8-15 మదు12-7 |
| 18 | శ | త్ర రా11-51 ఉఫ రా4-6 పవ11-51ల2-24వ ఉదు7-28ల శనిత్రయోదశి |
| 19 | ఆ | చ రా2-5 హస్త రా2-59 పవ12-7ల1-3వ మాసశివరాత్రి సాదు3-59ల [వాస్య |
| 20 | సో | ● అమా రా8-2చిత్ర రా1-35పవ10-31ల12-1వపదు12-6మదు2-25 దీపావళి అమా |
| 21 | మం | శుపా సా5-49 స్వా రా12-2 ఉవ6-50ల8-20వ తెవ5-18లఉదు8-15మదు10-32ల |
| 22 | బు | వి మ3-27 విశా రా10-21 ఉశేవ6-44వ రావ2-9ల3-38వ విదియతిథి పదు11-18 |
| 23 | గు | త ప1-13 అనూ రా8-48 రావ1-59ల3-29వదినం28-52 తిథిద్వయం ఉదు9-47మదు |
| 24 | శు | చ ప10-41 జ్యే రా7-4 రావ2-38ల4-8వ ఉదు8-15 మదు12-6 [2-24 |
| 25 | శ | పం ఉ8-25 మూ సా5-35 మవ4-5ల5-35వ రావ2-46ల4-17వ ఉదు7-29వ |
| 26 | ఆ | ష ఉ6-21 సప్త తె4-27 రావ12-5ల1-37వ సాదు3-55ల |
| 27 | సో | అ రా2-59 ఉషా మ3-23 రావ7-21ల8-55వ పదు12-6 తిరి దు2-24 |
| 28 | మం | న రా1-56 శ్ర మ2-46 రావ6-48ల8-23వ ఉదు8-16 రాదు10-31 |
| 29 | బు | ద రా1-17 ధని మ2-35 రావ9-55ల11-32వ దినం 28-38 పదు11-19ల |
| 30 | గు | ఏ రా1-14 శత మ2-53రావ9-33ల11-12వ మతత్రయఏకాదశి ఉదు9-47మదు2-21ల |
| 31 | శు | ద్వా రా1-34 పూభా మ3-39 రావ1-50ల3-31వ ఉదు8-16 మదు12-5ల |

## ముఖ్య పండుగలు

**19.** దీపావళి. **20.** కేదార గౌరీవ్రతము. **21.** ఆకాశదీప ప్రారంభము. **24.** నాగులచవితి.

# విషయసూచిక



ముఖచిత్రము: 'బొమ్మల కొలువు అమర్చుట'

—టి. కేశవరావు.




## దసరా సందేశము - సంస్కృత విద్యావశ్యకత

సీ॥ 'దురితంబు సంసృతి దొలగించు నదుపాధి, సజ్జనకర్ణ రసాయనంబు ;
పటుతరామయభార పాషాణటంకంబు భక్తలోకైక కల్పద్రుమంబు
సుఖకర శ్రీలోక సోపాన నిశ్రేణి సంపత్కదంబ పర్జన్య ఋతువు
కాతరీకృతభూత బేతాళ నిచయంబు సకలరక్షస్సముచ్చాటనంబు

గీ॥ చారు లీలాకదంబ సంచారభూమి
తనుతరేతరమోద సంధాయకంబు
హరిహర విరించి ముఖ్య దేవావధృత్య
ధీయమానంబుగాదె! శ్రీదేవి చరిత.

ఉ॥ జ్ఞానమునిచ్చు మోక్షము నొసంగు వెస న్నవరాత్రకాలమం
దేనరుఁడైన నంబ జగదీశ్వరిఁ బూజన భోజనంబులన్
ధ్యానములన్ జపంబులను దద్దయు హోమములన్ ధనాంగనా
గాన వినోద నృత్యముల గ్రన్ననఁ దుష్టియొనర్చి మించినన్.'

అని శరత్కాలమ్మున ఆశ్వయుజసితపక్షంబున ప్రతిపదాదినవరాత్రవ్రతంబొనర్చి దేవి నారాధించినవారు దారిద్ర్యాది భవరోగంబులచే విముక్తులయి అభీష్టసిద్ధులం గాంతురని ప్రసిద్ధి.

మున్ను శ్రీరామచంద్రుం డరణ్యంబున సీతా వియోగుండై కిష్కింధా నగరంబున నున్న సమయంబున నీ నవరాత్ర వ్రతం బొనరించిన కతముననే సముద్రంబు

బంధించి పరివార సహితంబుగా రావణ కుంభకర్ణుల సంహరించి విభీషణునకు రాజ్యం బొసంగి సీతా సమేతుండై అయోధ్యా నగరంబునకు జనుదెంచి నిష్కంటకంబుగ రాజ్య పాలనం బొనర్చెను. కావున నీవ్రతంబు శత్రునాశకరంబు, సంపత్కరంబు అభీష్ట ప్రదంబునునై వెలయుచున్నది.

ఇప్పుడీ దసరా సందర్భమున యీ జగన్మాతను బూజించి నేటి విషమపరిస్థితుల నెదుర్కొని దిగ్విజయము నందజాలు నాత్మశక్తిని గాంచుట మనవిధి.

ఇది విప్లవయుగము-ఎటుచూచినను, దురహంకారము, పరమలోభము, స్వార్థ పరత్వము, ద్రోహము మొదలగు దుర్గుణజాలము మూర్తిమంతమై నాట్యము సేయుచున్నది. సత్యము నామమాత్రావశిష్టమై యున్నది. హింస, సాధుపీడనము వివిధ రూపముల నెల్లదేశములందును ప్రబలత గాంచియున్నది. ఇట్టి భీభత్ససమయమున ప్రపంచ మెల్లెడలను ప్రజాసహస్రము మారణయంత్రముల కాహుతులై గతిగానక, ధృతి దూలి, హాహాకారంబులు మిన్ను ముట్ట పట్టరాని విషాదవేదనతో రక్షణకై నిరీక్షించుచున్నది.

ఇట్టి సమయమున స్వీయ జాత్యుద్ధరణకై పాశ్చాత్యరమణులుకూడ సర్వ శక్తులను వినియోగించుచున్నారు. మగలను, బిడ్డలను రణరంగమున కంపుటయేగాక స్వయముగా ప్రతి యుద్యమమందును పాల్గొని జయభేరి మ్రోగించుచున్నారు. ఏదేశమం దైనను ఆత్మ గుణములను పెంపొందింపగలవారు స్త్రీలే. ఈ గుణముల నుద్బోధించు నాగరికతయే మనమిప్పు డనుకరింపదగినది. మన భారత దేశమందు ప్రస్తుతము గృహధర్మ, జాతిధర్మ, సంఘధర్మములను సమగ్రముగా నిర్వహించుటకు వనితలకు వలయు విద్య ఎట్లుండవలయునో గమనింపవలసియున్నది. వేదకాలమునాటి స్త్రీల ధర్మములు, స్వాతం త్ర్యము, శక్తి, విజ్ఞానము, నాగరకత ఎంత ఉచ్చస్థితిలోనుండి, లోకమునకు మార్గ దర్శక ములై యలరారినవో కొంత చర్చించి తెలిసికొను టావశ్యకము. మన గమ్యస్థానమును గమనించియే మన ఆశయములు పరుగులిడవలెను. మన హక్కులును, బాధ్యతలును, మన కర్తవ్యములును ప్రత్యేక ప్రాముఖ్యత గలవిగా గుర్తించిననాడు పెడదారులయం దడుగులిడజాలము. పునరుద్ధరణ మపేక్షించితిమేని మహత్తరములైన మన ప్రాచీన సాంప్రదాయములలో గర్భితమై యున్న రహస్యములను వెలికిదెచ్చి వాటి మాధుర్య మును పరిగ్రహించ వలయును. దీనికి సంస్కృతభాష మిక్కిలి ఆధారభూతమై యున్నది. సంస్కృతము నేడు 'మృతభాష'యైనది. దీనితోపాటే మన విజ్ఞానమును మనకు దూరమై పోయినది. మన ప్రాచీన విజ్ఞానము అనంతమైనది. గభీరత్వముగలది. అట్టి అక్షరమైన విజ్ఞానము నందుటకు అక్షరాభ్యాస మహోత్సవము నెఱపుకొనుటకు వనితాలోకము సంసిద్ధమగు గాక.

# అభివృద్ధి కావలెనన్న

దేశిరాజు భారతీదేవి

తగినవిద్యగల్గి ధనముగల్గియున్న స్త్రీ దేశములో నే సంఘమునైన పోషించగలదు. ఎట్టి దేశసేవకైనను ముందంజ వేయగలదు. ధన విషయమున స్వాతంత్ర్య మెపుడు గల్గునో అప్పుడే సమస్త విషయములందు పురుషులతో సమానమైన హక్కుగలది యగును.

ప్రపంచ సాంఘికవ్యవస్థలు యెల్లప్పుడును మారుచునే యున్నవి. ప్రతిసంఘము మారుచు కొన్ని వేళల చెడిపోవుచు, కొన్నివేళల బాగుపడుచుండును. అట్లే హిందూ సంఘము సయితము మారక తప్పినది గాదు. ఈ మార్పు రాజకీయార్థికపరిస్థితుల ననుసరించియే గల్గినది. సంఘాచారములు, వైవాహికాచారములు మొదలగునవి మారినను స్త్రీలహక్కులు మాత్రము మారక గడ్డకట్టుకొని పోయినవి. మహమ్మదీయుల పరిపాలనలోనైన హిందూ స్త్రీలహక్కులు మారలేదు. వారిలో స్త్రీలకు తండ్రి ఆస్తియందు సోదరులతో బాటు భాగార్హత గలదు. వారిపాలన యందైనను తమయాచారము ప్రకారము స్త్రీలకు భాగార్హత నొసంగలేదు. మహమ్మదీయు లితర సంఘము నందలి స్త్రీలను బలవంతముగా నెత్తుకొనిపోయి తమమతములో గలుపుకొనుటయేగాని తమరాజ్యము నందున్న హిందువులను బాగుపరచు నుద్దేశ్యమేలేకుండెను.

ఇక హిందూరాజుల పరిపాలన మందన్ననో వారు వారి శాస్త్రములు చెప్పిన ప్రకారము అమలు జరుపుట దప్ప మార్పుసంగతే వారికి గిట్టదు. హిందూధర్మశాస్త్రములోని నిబంధనలన్నియు స్త్రీలకు వ్యతిరేకమే. హిందూస్త్రీకి స్వాతంత్ర్య మెన్నడునులేదు. 'పితారక్షతికౌమారే భర్తారక్షతియౌవనే। రక్షంతి వార్ధకేపుత్రా, న స్త్రీస్వాతంత్ర్యమర్హతి' అనుసూత్రమే వారికి ప్రమాణము. ఈసూత్రమునే మనస్సునందుంచుకొని స్త్రీలకు భాగార్హతలేకుండ జేసినారు. అప్పటి కాలపరిస్థితులలో నాధర్మసూత్రములు సక్రమముగానున్నను సంఘవ్యవస్థలు, ఆర్థికపరిస్థితులు, సంఘాచారములు, మారిపోయి కేవలము నూతనస్వరూపము మనదేశమునకు కలిగినందున యిప్పటి సంఘమునకు వలసిన మార్పులు ధర్మశాస్త్రములలో గల్గించు టావశ్యకము.

అందువల్లనే యిప్పటివారిలో కొంద రుదారులు ప్రస్తుత స్త్రీల దుస్థితిని కనుగొని కనికరించి శాసనసభలలో కొన్నినూతన చట్టముల ప్రవేశపెట్టుచున్నారు. అందులో స్త్రీల ఆస్తిహక్కుచట్టము ముఖ్యమైనది. ఈ శాసనము నెల్లవారామోదించుటకై స్త్రీలు సర్వవిధముల ప్రయత్నము సలుపవలెను. పత్రికలలో వ్యాసముల ప్రకటించియు జరుగనున్న మహిళాసమావేశములలో తీర్మానముల గావించియు నాందోళన గావింపవలెను. 1935 వ వత్సరము శాసనము చేయబడిన స్త్రీల వారసత్వపు చట్టము మఖిలో పుట్టి పుబ్బలో గిట్టినదైనది. ఇండియా దొరతనమువారే ఆ చట్టముచేసినను వ్యయసాయభూముల కన్వయింపరాదని న్యాయకోర్టువారు తీర్పుచేసినారు. అందు విషయమై తగిన యాందోళన గావించి యా చట్టమును

పూర్తిగా నమలులోకి వచ్చునట్లు చేయవలసియున్నది. స్త్రీల యభివృద్ధి యెడ సుముఖులగు శాసనసభ్యులు లేకపోలేదు. కావున స్త్రీ లెల్ల రేకగ్రీవముగా తమ తండ్రి యాస్తిలో కొమారులతోబాటు కుమార్తెలకును ఆస్తి హక్కును గలుగజేయు చట్టము నామోదించునట్లు ప్రయత్నము సల్పు టావశ్యము.

ఇక శారదాచట్టమువల్ల స్త్రీలకు విద్యాభివృద్ధికిగాని, బాలిక లారోగ్యమునకుగాని కొంత యుపయోగమే. కాని యీ చట్టమును యథేష్టముగా నుల్లంఘించుచున్నను తగినచర్య దీసికొనక దొరతనము వారుపేక్షించుచున్నారు. ప్రజ లుదాసీనము జూపుచున్నారు. ఆరోగ్యమునకేగాదు, చిత్రకళ, సంగీత సాహిత్యాది సమస్త కళాభ్యాసములకును విజ్ఞానసంపాదనకును భంగకరమే. ఇంత అపకార మొనర్చు బాల్య వివాహములు సమూలముగా నశింపవలెను. సంఘాభిప్రాయములు పూర్వాచారబద్ధములైనందున సామాన్య బోధలవల్ల నిట్టి దురాచారములు పూర్తిగా నడుగంట జాలవు. కావున నిట్టివానిం దొలగించుటకు శాసనమే శరణ్యము.

శారదాశాసనము చేసి యూరకున్నందువల్ల ప్రయోజన మావంతయు లేదు. ప్రస్తుతమమలులో నున్న శారదాచట్టము నిష్ప్రయోజనముగా నున్నది. ఈబిల్లువల్ల ప్రజలకేమాత్రము భయములేదు. గుంటూరులో చేయరాదంటే యేమనురకో వెళ్లి పెండ్లిచేసికొని రావచ్చును. బ్రిటిష్ సరిహద్దుదాటితే బాల్యవివాహము చేయుట కేభయమునులేదు. వారిపై దొరతనము వా రెట్టిచర్యను తీసికొనుటలేదు. వారికి విరోధులెవరైనయుండి కొంతద్రవ్యనష్టమునుబొంది ఛార్జి దాఖలు చేసిననేగాని నేరస్థునికి శిక్షలేదు. అక్కారణమున నూటికి పదికేసు లైనను చర్చకురావడములేదు. కావున స్త్రీ సంఘపక్షమున స్త్రీలక్షేమముకొఱకై గావింపబడిన శారదాబిల్లు లోని నిబంధనలన్నియు మార్పుచేయించవలెను. ఇందుకు దొరతనము వా రత్యంత శ్రద్ధదీసికొనవలెను. జనన మరణలెఖ్ఖలనెట్లు గ్రామోద్యోగస్థుల కెల్ల నియమించిరో, అట్లే యే గృహమున వివాహము జరిగినదియు విచారించి వధూవరులవయస్సును పరిశీలించి తగినచర్య దీసికొనునట్లు గ్రామ మునసబులకు ఉత్తర్వుచేయవలెను. జనన రిజష్టరుకూడా వారివద్దనేవుండును గావున బాల బాలికల వయస్సు వారికే బాగుగాతెలియును. గావున ప్రభుత్వము వా రిట్టి యేర్పాటు చేయుటకు తగినయాందోళన గావించి సత్వరమిట్టి మార్పునుచేయించుట స్త్రీలవిధి.

మనదేశములో స్త్రీలకు గలలోపము లీరెండే. విద్య, ధనము. శారదాబిల్లువల్ల పదునైదేండ్ల లోపల వివాహముగాకుండ విద్యాభ్యాసము గావించినచో, విద్యాలోపము కొంతవరకైన దీరునుగదా! వారసత్వపు చట్టమువల్ల తండ్రికిగల ఆస్తిలో కొంతవరకైన యనుభవించుహక్కు గల్గెనేని ధనలోపము కొంతవరకుదీరును. తగినవిద్యగల్గి, ధనముగల్గియున్న స్త్రీ దేశములోనే సంఘమునైన పోషించగలదు. ఎట్టి దేశసేవకైనను ముందంజ వేయగలదు. ధనవిషయమున స్వాతంత్ర్యమెపుడుగల్గునో అప్పుడే సమస్త విషయములందు పురుషులతో సమాన మైన హక్కుగలదియగును. స్త్రీలక్షేమముగోరే ప్రతివ్యక్తియు నిట్టివిషయములందు సంపూర్ణమైన శ్రద్ధతీసుకొని కృషిసల్పవలెను. స్త్రీ సంఘాభివృద్ధియంతయు పైరెండు సూత్రములమీదనే యాధారపడియున్నది. స్త్రీ లభివృద్ధిగావలెనన్నచో, సత్వరమిట్టి చట్టములచేయించుట, మార్పులగావించుట మిక్కిలి యవసరము. లేకున్న భారతస్త్రీలకెట్టి క్షేమమును గలుగబోదు. జరుగనున్న మహిళాసభలలో నిట్టితీర్మానము లత్యవసరము. స్త్రీ లెల్లరును గమనింపవలెను.

# బుద్ధదేవుని సతీమణి యశోధర దివ్యచరిత్ర సంగ్రహము



సకల మానవలోకమునకును అమృతప్రాయమైన దివ్య సందేశములనిచ్చి నిర్వాణపదవికి మార్గమును చూపియుండిన శ్రీ గౌతమ బుద్ధుని జీవిత విశేషములను గూర్చి తెలియనివారు ఉండరుగాని, ఆయన ధర్మపత్ని యశోధరాదేవినిగూర్చి బాగుగా ఎరిగియున్నవారు బహు కొద్దిమందియే.

డాక్టర్ ఈశ్వరీ ప్రసాద్ గారు ఎమ్.ఎ,డి.లిట్. ఓరియంట్ ఇలస్ట్రేటెడ్ వీక్లీలో ఆంగ్లమున వ్రాసిన వ్యాససారాంశములు బుద్ధుని సతీమణిని గూర్చి చదువరులకు మంచి పరిచయము చేయగలవు:

యశోధర గొప్ప భక్తిభావముతోను, త్యాగ సంపన్నతతోను బుద్ధుని పథము నవలంబించి, నిర్వాణమునందిన మహాసాధ్వి.

యశోధర సుప్రబుద్ధుని కుమార్తె. ఆయన హిమాలయముల దిగువను కోలీయవంశక్షత్రియుల నేలిన రాజు. సుప్రబుద్ధుని సోదరీమణులు మహామాయయు, మహాప్రజాపతియు కపిలవస్తు మహారాజగు శుద్ధోదనుని భార్యలు. యశోధరకు దేవదత్తుడను సోదరుడొకడుండెను. యశోధర బాల్యమునందే జ్యోతిషశాస్త్రవేత్తలు ఈమెకు మహారాణి పదవికి మించిన ఉన్నత పదవి యేదో లభ్యము కాగలదని జోస్యము చెప్పియుండిరి. ఈ రాజకుమార్తె మంచి విద్యాభ్యాసమును బడసెను. చదువు వ్రాతలేకాక, ఈమె నాట్యమును సంగీతమును వివిధ క్రీడా వినోదములను నేర్చియుండెను. ఈ సుందరగాత్రి కంఠస్వరము అత్యంత సుమధురముగ నుండెడిదట. ఈమె గుఱ్ఱపుస్వారియు, విలువిద్యయు కూడ నేర్చి కౌశలము చేకూర్చుకొనెను. చిన్ననాటనుండియే ఈమెకు మానవులందే ప్రేమ సౌజన్యములుగాక పక్షులు జంతువులయందును ఆదరానురాగము ఉండెను. అప్పుడప్పుడు కొండలలోను తోటలలోను విశ్రాంతి విరామములకొఱకు గడపుచు ఈమె తన చెలులతో నిట్లనుచుండెడిదట "స్వాతంత్ర్యమెంత ఆనందదాయకము!"

కపిలవస్తు రాజకుమారుడగు సిద్ధార్థునకే తన కూతురునిచ్చి వివాహము చేయవలెనని యశోధర తండ్రి కోరికగ నుండెను. స్వయంవర మొకటి జరిగెను. కోలీయవంశక్షత్రియకన్యక లనేకు లీ సభలో హాజరుగ నుండిరి. తనకు నచ్చిన కన్యను వరించుమని సిద్ధార్థుడుకూడ ఈ సభకు ఆహ్వానింపబడెను. సుందరీమణులగు కన్యక లనేకమందికి రాజ కుమారుడు ఒక్కొక్క అశోకభాండములో నొక్క నగను ఉంచి ఒక్కొకరికి బహుమతులిచ్చివేసి పంపి, తాను వెంటగొనివచ్చిన ఆభరణములన్నియు అయిపోగా, ఆఖరుకు తన ఎదుటబడిన సౌందర్యరాశియగు యశోధరను తాను వలచి వివాహమాడియుండెను.

ఈ దంపతులకు ఒక సుపుత్రుడు జనించెను. బుద్ధుని మహానిష్క్రమణము, రాజ్యపరిత్యాగము సుప్రసిద్ధ సంఘటనలే గదా.

గౌతమబుద్ధుడు తన మతమును ప్రచారముచేయుచు భిక్షుక సన్యాసిరూపమున కపిలవస్తుకు వచ్చినప్పుడు యశోధర తానూ భిక్షుణిగా నుండగోరి బుద్ధుని యనుమతి వేడెను. ఆయన అనుజ్ఞ యిచ్చెను. ఆమె యితర భిక్షుణులతో కలసి యొక బౌద్ధవిహారమున యుండెను. ఆమె 74-వ యేట తాను ఇంక పరినిర్వాణ పదవిని చేరుటకు తగు సమయ మాసన్నమయ్యెనని భావించి, జననమరణముల కతీతమగు ఆ దివ్య పథమునకు తగు అర్హతకొఱకు ప్రార్థనచేసి, వైశాఖమాసమున నొక సాయంకాలమున రాజగృహములోని తన సన్యాసినీ మఠమును వీడి, చేత కమండలముదాల్చి, అడవిని బడి పోయి వెన్నెలలో ఒక చెట్టుక్రింద కూర్చొని నిర్వాణ పదవిగూర్చి కొంతసేపు ధ్యానముచేసి, బుద్ధుని సన్నిధికేగి, ఆయనవద్ద క్షమార్పణముచేసి ఇహ యాత్రను చాలించుటకు సెలవువేడెను. బుద్ధదేవు డామెను కొన్ని ప్రశ్నలడిగి, ఆమె ఉత్తీర్ణయైనదని సంతృప్తిజెంది, సెలవు నొసంగెను.

యశోధర తన గదిని చేరుకొని, అర్ధరాత్రి సమయమున పరమశాంతి ఆనందములతో మహా సమాధి నొందెను.

భారతదేశమునకు మహిమాన్విత ప్రాశస్త్యమును దెచ్చిన ప్రాచీన మహా మహిళామణులలో గణనీయ కీర్తి వహించినది యశోధరాదేవి.

# స్త్రీలు - నాటకరంగము

శ్రీమతి వేదవల్లి తాయారమ్మ

నిర్లిప్తుఁడగు భగవంతుఁడు తానేమియు నంటక సాక్షిస్వరూపుఁడై ప్రకృతికే సృష్టిస్థితిలయాధికారమంతయు నొసఁగెను. ఆమె సాహాయ్యములేనిదే యే దేవతలు నెట్టిపనిని చేయఁజాలరు. నేఁటికిని నవరాత్రోత్సవములందు హిందూదేశమున జరుఁగు దేవీ పూజలే దేవీ మాహాత్మ్యమును ఘనోర్ల్లఁ జాటుచున్నవి. త్రిమూర్తులును వారి దేవుల కెట్టి యగ్రస్థానముల నొసఁగిరో, చూడుఁడు! తమ శరీరములనే యిచ్చి వారియందుఁగల గౌరవ ప్రేమలను వెలిబుచ్చుచున్నారు. వేయేల! ప్రకృతిని పూజింపనిదే పురుషుఁ డెన్నటికిని యభివృద్ధి నొందలేఁడు.

ప్రాచీనకాలమునుండియుఁ బారంపర్యముగ దేవీ స్వరూపిణులగు స్త్రీలు మనవారిచేఁ బూజింపఁబడుచునేయున్నారు. పురుషులకెందును దీసిపోని సర్వసామర్థ్యములు వీరికిఁగలవు. ముద్దార నేర్పించినచో ముదితలు నేరఁగరాని విద్యయేలేదు. ఇంతేకాక పురుష దుర్లభమగు నొక యసామాన్యమగు విశేషము స్త్రీలకడఁ గలదు. ఇనుపకచ్చడాల్కట్టి యాకలములఁ దిని తపోనియమముల ననుష్ఠించు మునీంద్రులను సైతము మోహపెట్టు మదనబాణ పరంపరల నరికట్టు దిట్టతనమునకు స్త్రీలు పెట్టి పుట్టిరి.

లేనిచో, మరణించిన భర్తను మరలఁ బడయఁ గలిఁగిన సావిత్రియు, దశకంధరునంత వాని నంతమొందించిన సీతామహాసాధ్వి మున్నగు సతీతిలకము లెట్లు మహాయశము నందఁగలరు? పాతివ్రత్యమునకుఁ బట్టుకొమ్మ యనఁదగిన మన భారతదేశమున నిట్టి సాధ్వీమణులెందఱో గలరు. ఏలాటి కష్టనిష్ఠురములకైన నోర్వఁగల శక్తి స్త్రీలకే కలదనినను నతిశయోక్తి కానేరదు. విద్యా విషయములందును, రాజకీయ విషయములందును, యుద్ధరంగములందును గూడ విశేష ప్రతిభను జూపిన యువతీరత్నములున్నట్లు చరిత్ర వాకొనుచున్నది. లలితకళలు వీరి సొమ్ము. కవిత్వము, చిత్రలేఖనము, సంగీతము మున్నగు కళలందుఁ బ్రావీణ్యము స్త్రీలకుఁ గలిఁగినట్లు పురుషులకుఁ గలుఁగుట దుర్లభము. సహజకోమలములగు నారీహృదయము లీ కళల నధికముగా నాకర్షించును. కావుననే మహాభారత కాలమునుండియు నుత్తర శశిరేఖ మొదలైన రాచకన్నెలు కూడ నృత్యగీతాదికళల నభ్యసించినట్లు మనగ్రంథము లుద్ఘోషింపుచున్నవి. నాట్యాదులు చేయుటవలన స్త్రీలకుఁ జక్కని యంగసౌష్టవ మేర్పడును. స్త్రీలకుఁదగిన సుకుమార వ్యాయామ మింతకంటె మఱొకటి లేదు. సంగీతము పాడుటవలన హృదయకోశమునకు సంబంధించిన వ్యాధు లుత్పన్నము కావని యందురు. ప్రాచీను లిందలి పరమార్థమును గ్రహించుటవలననే నృత్యగీతములను స్త్రీలకుఁదగిన విద్యలుగా నేర్పఱచిరి. 'చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతి పిందెలన్నట్లు' నేఁడీ విద్యలయందలి ప్రధానాశయము నశించి వేశ్యావృత్తిని పోషించుటకై యుపకరించినవి. ఆదర్శ మెంతయున్నతమైనదైనను గ్రమముగా జనసామాన్యమునఁ బ్రవేశించినకొలఁది హ్రస్వత్వ మొంది వెట్టితలలు వేయకమానదు. చివరకీ జాతి సంఘమునకు వేఱుపుర్వులై జాతిని నశింపఁజేయుచున్నది. కులస్త్రీ లీ విద్యలను గనిన భయమొందునంతటి దురవస్థ ప్రాప్తించినది. సంగీతకళకు సంబంధించిన యన్ని సంస్థలందును వేశ్యలే ప్రాధాన్యము నొందవలసిన గతి కలిఁగినది. కాని నేఁడు విద్యాధికులైనవారు స్త్రీ లందఱును సమముగ నీ విద్యలందుఁ బాల్గొనవలెననియు, నాటకరంగము

లందును, స్త్రీలే స్త్రీ పాత్రలను నిర్వహించినచో నాటకకళ వృద్ధిఁబొందుననియుఁ బ్రచారములు గావించుచున్నారు. కాని యిది విమర్శనీయమగు క్లిష్ట సమస్య. ఒకే విషయ మొకరికి మంచిగను, వేఱొకరికి విషమముగను దోఁచవచ్చును. కాన నధిక సంఖ్యాకులకుఁ గలుఁగు కీడు మేళ్లను బరిశీలించనిచో నీ సమస్య స్త్రీ జనోపకారి కాఁజాలదు.

భారతీయవాఙ్మయమున నాటకకళ యగ్రతాంబూల మందినది. రాజాధిరాజులు కూడ నీ దృశ్య కావ్యములను రచించి చూచి యానందించెడివారు. రత్నావళీ నాటికలో 'శ్రీ హర్షో నిపుణః కవిః పరిషద ప్యేషా గుణగ్రాహిణీ' అని యా నాటికా రచయితయగు శ్రీ హర్షదేవుఁడే వక్కాణించెను. చక్కని నాటక ప్రదర్శనములను జూచుటచేఁ బ్రజల కొకవిధమగు ననిర్వాచ్యానందము కలుఁగుటయే కాక, భక్తి, నీతి, మత రాచకీయాది విషయములు సుబోధములై మనస్సుల హత్తికొనిపోవును. తాత్కాలికమగు రసానుభవమే కాక కావ్యము విశ్వశ్రేయమనుట కిదియే తార్కాణము. అందు స్త్రీ పురుషులు కలసి నటించుట యిప్పటి నాగరికతకు ముఖ్యలక్షణము. మఱియుఁ జలనచిత్రము (సినిమా)లఁ దిలకించినచో బ్రతుకులే నాటకములో, నాటకములే బ్రతుకులో నిరూపించుటకు శక్యము కాకున్నవి. నాటకమన నటనామాత్రమే. స్త్రీ థా పురుషులగు రామాదుల ననుకరించి నటించుట. నటుఁడు తాను రసానుభవము నందక తన హావ, భావాదులచేఁ బ్రేక్షకులను రసతన్మయులగునట్లు జేయుటయే యుత్తమ నాటకకళ. స్త్రీ పురుషుల యన్యోన్య సమాకర్షణములు (రంగ వర్జ్యములగు) ఆలింగన, చుంబనాదులు స్వయముగా జరుపునపుడు ప్రేక్షకులతోఁబాటు నటులకును రసావేశము కలిగి యాభాస యగుననిన నేరము గాదనజాలరు గదా! ఈ స్త్రీ పురుషుల కలయిక నీతి, నియమములకును భంజకమే యగును. పురుషులతోఁ గలసి నటించినంతమాత్రమున స్త్రీలు నీతి బాహ్యలు కానేరరని కొందఱు రసపిపాసువు లందురు. కాని శృంగారాదిభావములను బ్రదర్శించుచు స్వేచ్ఛా విహారములు సేయువారి మధ్య నీతి నిలువలేక నిలువున నీరై పోవును. కళా ప్రపంచమున నీతికిఁ దావేలేదు. కాన నీతిని నిరోధింపవలసిన సమస్యలనే కళాక్షేత్రమునఁ గాలూననీయకున్నచోఁ గళ కేలాటి భంగమును గలుగదు. వేశ్యలు పతితలు మున్నగువారికంటెఁ గుల స్త్రీలే రంగమున కెక్కినచో నెట్టి దోసఁగును బొసఁగదని కొందఱు కళావేత్తలందురు. ఇది యెంత సమంజసముగనున్నదో సహృదయు లూహించెదరుగాక! ఇండ్లలో ననేక కట్టుబాట్లలో నుండినవారి కీయవాంతర సన్నివేశములు కలిగి శీల సంరక్షణము దుస్సాధ్యమగుచుండ నింక యూలనున్నవారిని ముంగిలి కీడ్చినచో నేమి చెప్పనగును? ఎచ్చటనో దేవికారాణివంటి యుత్తమస్త్రీలను జూచి పై యభిప్రాయము కలుఁగుచున్నను నందఱి స్త్రీల విషయమున నట్లెంచుటకు వీలులేదు. భారతజాతీయకను బదిలపరచు రత్నపేటికలనఁదగు స్త్రీ రత్నములను రచ్చకెక్కించుటకంటె గోప్యముగ నుంచుటయే సంఘశ్రేయము.

మఱియు స్త్రీలు స్త్రీ పాత్రలను దప్పక ధరించినఁగాని నాటకకళాభివృద్ధి జరుగనియెడల స్వేచ్ఛాచారిణులగు స్త్రీలనైన వినియోగింపవచ్చును గాని కులస్త్రీల నాపనికిఁ బురికొల్పుట గడు శోచనీయము. అట్టివారు జనసంఘమున నెప్పటికప్పు డుత్పన్నమగుచునే యుందురు. ఇట్లనుటచే సంగీతాదుల నందఱు నేర్చుకొనరాదను నపార్థము చేయఁజనదు. విద్యలు నేర్చినంత మాత్రమునఁ బ్రదర్శింపవలెనను నియమ మెచ్చటఁగలదు? ఎవరి యానందముకొఱకు వారు విద్యలను గ్రహింపవచ్చును. భారతీయ నాగరికత పాతివ్రత్యాది సుగుణ సూత్రాళిచేఁ జుట్టఁబడినంతకాలము బాధాకరములగు పై పద్ధతులను విడనాడుటయే సమంజసము.

# పుష్పాంజలి

గుణగణ భవశీల!
గృహలక్ష్మి లీల
కూర్చెద నీవేళ
కుసుమాల మాల!



అఖిలార్థ ధర్మాలు
తత్త్వార్థ యోచనలు
నిజబోధనల యందె
నివ్వటిల్లినవి!



ఇల్లాలు మోదాలు
ఇంతుల ఖేదాలు
భవద్యశో వీణ
భవ్య తంత్రులు మ్రోగె!



'బర్హి లాస్యక్రియలు
వార్ధి నటనములు
తవ మోహనక్రీడ
తాండవించినవి'



నీ నిర్మలాశయము
నేర్పుమై వెదజల్లి
అనంత భావాల
అలవఱచు లక్ష్మి!



తేజస్వి నామ!
యశో లలామ!!
ప్రేమాతిగరిమ
కుసుమాల గొనుమ!



తెనుగునాడు స్త్రీల
దివ్యతను నెలకొల్పి
కలకాలి మీ యిలను
వెలుగొందు లక్ష్మి!



రంజిత గుణశీల
రతనాలవాల
పూజింతు నిను నేడు
పుష్పాల మాల!

● శనివారపు అన్నపూర్ణాదేవి ●



# "ఈ గుణపాఠం చాలు"

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

---

## ౧-వ రంగము

### రాఘవరావు, రాజేశ్వరి

రాఘవరావు:-(యింట్లోకి వస్తూ) రాజేశ్వరీ! ఏమిటి చాలా ఏకదీక్షగా వ్రాస్తున్నావు?

రాజేశ్వరి:-ఆ! ఏమీలేదండీ (అని రాజేశ్వరి కాగితాలు చాటుగా తీసుకుంటుంది.)

రాఘ:-ఆ కాగితాలు చాటుగా పెట్టుకుంటున్నావు నేను చూస్తానని. ఏదో భావగీతమో, కథానకమో, ఏకాంకికో వ్రాస్తున్నట్టున్నావే!

రాజే:-మేము మీవలె భావకవులము గాదు.

రాఘ:-మఱి ఆ రచన యేమిటి?

రాజే:-అంతా తయారైనతర్వాత మీకు చూపిస్తాను. మీకు చూపిస్తేగా మంచీ చెడ్డా తెలిసేది. అంత తొందర యెందుకూ?

(ఇంతలో కొమార్తె లీల, కొమరుడు కృష్ణుడు వస్తారు)

రాఘ:-అమ్మాయి! ఏమిటే మీ అమ్మ వ్రాసేది?

రాజే:-(చెప్పవద్దని కన్ను మలుపుతుంది.)

(లీల మాట్లాడకుండా నిల్చుంటుంది.)

కృ:-నాన్నా నేను చెప్పనా? అమ్మ ప............

రాజే:-కృష్ణా! (అని కొడుకును మందలించి) ఏమీలేదండి, వాడి మాటలన్నీ వట్టివి.

కృ:-ఆఁ వట్టివా? నీవూ రంగనాయకమ్మగారూ కలిసి పజిల్ వ్రాస్తూఉంటారే. చాలా డబ్బు వస్తుందంటివే. డబ్బువస్తే నాకు తొక్కుడుబండి కొనిపెట్టుతానంటివే.

రాఘ:-(పకాపకా నవ్వి) భేష్, బలే మంచివాడవురా, కృష్ణా నీకు మంచి తాయం బెట్టుతా రా, ఓహో పజిల్ పిచ్చి నీకుగూడా పట్టిందీ. యూరోపులో యుద్ధమేఘాలు క్రమ్మినట్టు యిప్పుడు మన తెలుగు దేశమంతటా పజిల్ మేఘాలు కమ్మినాయి. వాళ్లు డబ్బంతా అగ్నిలో ఆహుతిజేస్తుంటే మనవాళ్లు పజిల్సులో ఆహుతిచేసుకుంటున్నారు. ఇదివఱకూ మా మగవాళ్లకే ఈ పజిల్ పిచ్చి ఉండేది. ఇప్పుడు తెలుగు పజిల్సు వచ్చినతర్వాత స్త్రీలుగూడా ఈ పిచ్చిలోపడి డబ్బు తగలేస్తున్నారు.

రాజే:-తగలేయడమేమిటి? మొన్న ఎవరికో యిరవై వేలు వచ్చినాయని పత్రికలో వేశారు చూడలే?

రాఘ:-ఎందరేడిస్తే?

రాజే :-ఏడవడ మెందుకు? ఇవ్వాళ వాళ్లకు వస్తే రేపు మనకు వస్తుంది.

రాఘు :అఁ వస్తుంది. మహామహా కొమ్ములుతిరిగిన మేధావులే నెల నెలా వంద, యాభై రూపాయలు పాడు చేశామని కొట్టుకుంటున్నారు.

రాజే :-అందరూ పోగొట్టుకుంటె ఆ గెలిచేవారి జాబితా అంతా?

రాఘు :-ఎవడో నూటికి కోటికి ఒకడు గెలిస్తే! ఆ గెలిచిన ఒక్కపేరు పెద్దపెద్ద అక్షరాలతో కనిపించేటప్పటికి భ్రమపడి దీపంలో శలభాలులాగా పడిపోతుంటారు వేలకొలది జనం.

రాజే :-అఁ మీ మాటలకేమి. ఈ పత్రికలో బహుమానాల జాబితా చూచారా? ఎంతదీర్ఘంగా ఉన్నదో! కొన్ని వందల పేర్లున్నట్టున్నాయి?

రాఘు :-ఏ పుణ్యాత్ముడైన పజిల్ మేనేజరైనా ఓడినవాళ్ల పట్టిక ఒకమాటు ప్రకటిస్తే తెలుస్తుంది. ఎన్ని వేల సంఖ్యలో ఉంటుందో.

రాఘు :-అయితే ఈ బహుమానదార్లందరికీ బహుమానాలు సరిగా యివ్వబడుతున్నవనే అంటావా?

రాజే :-అయ్యో! ఒకరుగాదు, యిద్దరుగాదు. ఇంతమంది జనం యివ్వకపోతే ఊరుకుంటారా? గోలపుట్టదా?

రాఘు :-దానిలో చాలా కిటుకులు ఉంటాయిలే. అయితే నీ పజిల్ బహుమాన మొత్తమెంత?

రాజే :-అయిదువేలు.

రాఘు :-ప్రథమ బహుమతి?

రాజే :-మూడువేలు.

రాఘు :-భేష్, మన లీల పెండ్లికి ఒక్క కానీ అప్పుచేయకుండా అల్లుడి కట్నంతో సహా సమస్త పెండ్లి కర్చులకు సరిపోయే మొత్తమంతా ఒక్కరూపాయి కర్చుతో సంపాదిస్తున్నావుపో.

రాజే :-అబ్బా! లీల పెండ్లికి నేనెందుకిస్తాను? నాపేర బ్యాంకిలో వేసుకొని సొంతకర్చులకు వినియోగించుకుంటాను.

రాఘు :-కొంచెమైనా ఔదార్యంలేకుండా వచ్చిన మొత్తమంతా దాచుకోడం సబబుగాదు. ఎంతమంది త్యాగంచేస్తే నీకింత సొమ్ము వస్తున్నది చెప్పు.

రాజే :-ఇంక యెవ్వరికీ యేమీ యివ్వను గాని మీకుమాత్రం ఒక బహుమతి చేస్తాను లెండి.

రాఘు :-అయితే వెస్టు అండు కో నుంచి ఒక నూరురూపాయల రిస్టువాచి కొనియియ్యి చాలు.

కృ :-అబ్బా నాకు త్రొక్కుడుబండి కొనిపెట్టకపోతే నేనూరకుంటానుగా?

లీల :-నాకు రాళ్లహారము చేయిస్తానన్నావుగా, నాకు చేయించవలసిందే. (వంటమనిషి సుబ్బమ్మ తటాలున లోపలనుండి వచ్చి) అమ్మగారు నామాట మఱచిపోకండి. చలికాలం తడిగుడ్డ కట్టుకోలేక చస్తున్నాను. ఒక్క పట్టుపంచ కొనిపెట్టితిరా, మీపేరుగా నాలుగేండ్లపాటు కట్టుకుంటాను.

రాజే :-దానికేమి భాగ్యంలే సుబ్బమ్మా, పదిరూపాయలు పెట్టితే వస్తుంది.

రాఘు :-బహుమానాల పంపకం సెటిలైంది. ఇంక బహుమానమే రావాలి.

రాజే :-పజిలు పంపవలసిన ఆఖరుతేది రేపే, రేపు మనియార్డరు చేసిపెట్టుతారుగాదూ.

రాఘు :-సరిసరి, పజిల్ రుసుములు మనియార్డరులు చేయవలసినవాడను నేనా? డబ్బువస్తే బ్యాంకులో వేసుకొనేదానవు నీవా?

రాజే :-మరి మాకు డబ్బెక్కడిదీ?

రాఘు :-డబ్బులేనివాళ్లకీ పనులెందుకూ?

రాజే :-సంపాదించుకుందామనే కాని, సంపాదన చేతగాదు, ఖర్చులైతే బాగా పెడ్తావంటారుగదా. సంపాదించుతానంటె కాస్త సహాయం చేయరాదూ?

రాఘు :-సరే రెండురూపాయలు శాంక్షన్.

రాజే :-రెండురూపాయలేనా? వాళ్లు పాతిక యాభై ఎంట్రీలు పంపవలెనంటుంటే.

రాఘు :-వాళ్లకేమి, నూరు, రెండునూర్లు ఎంట్రీలైనా పంపమంటారు. ఈ పజిల్సు దేశోద్ధరణకు పెట్టినవా? ప్రజోద్ధరణకు పెట్టినవా? భాషోద్ధరణకు పెట్టినవా? వారి ఉద్ధరణకే వారు పెట్టుకున్నారు. ఎంత ఎక్కువ ఎంట్రీలు పంపితే అంత ఎక్కువ డబ్బు వస్తుంది. వారు పంపమనక యేమిచేస్తారు?

రాజే :-అయితే ఎన్ని పంపమంటారు?

రాఘు :-పది చదరాలు పూర్తిచేయి చాలు. పోస్టు కర్చులతో సహా రెండుంబావలాలో వదిలిపోతుంది. అయినా పూర్తిచేసిన పజిల్సు నాకు చూపనేలేదుగా, నాకేమిపట్టింది డబ్బు కట్టడానికి?

రాజే :-ఆఁ మీకు చూపకుండానే పంపుతానా? భోజనాలు కానివ్వండి నిదానంగా చూస్తురుగాని.

రాఘు : సరే పద.

## ౨-వ రంగము

## రాజేశ్వరమ్మగారి యిల్లు - సమయం సాయంత్రము 4 గంటలు.

## కమలమ్మ, రంగనాయకమ్మ ప్రవేశము

రంగ :-రాజేశ్వరమ్మగారూ! ఏంజేస్తున్నారు?

రాజే :-ఏమీలేదు. రండి, రండి, కూర్చోండి (అని చాపవేస్తుంది.)

అందరు కూర్చుంటారు.

రంగ :-పజిల్ ఏంచేశారు, పంపించారా?

రాజే :-ఆఁ ఏమవుతుందో యివ్వాళే పంపించామండీ, మీరుగూడా పంపారా?

రంగ :-నేను నిన్ననే పంపించాను.

రాజే :-కమలమ్మగారూ మీవిగూడా పంపారా? మీరూ వ్రాశారుగా.

కమ :-ఆఁ వ్రాశానే గాని పంపలేదండి. పంపమంటే మావారు గట్టిగా కేకలేశారు.

రంగ :-ఏమీ?

కమ :- ఈ పజిల్ వ్యవహారమంతా వట్టిమోసం. గెలుస్తామనుకోడం వట్టి దుర్భ్రమ. ఈ కరువుకాలంలో మన కొచ్చే యాభైరూపాయలతో పిల్లలు మనము జీవించడమే కష్టంగా ఉన్నది. యిటువంటి దుర్వ్యయాలకుగూడా ఎక్కడవస్తుంది. మన కష్టార్జితం మనకు చాలదా? లేనిపోని దురాశలెందుకన్నారు. సరే పోనీ వారి కిష్టంలేనప్పుడెందుకని ఊరుకున్నాను.

రంగ :- మావారుగూడా ఈ పజిల్సుగూడా జూదములవంటివేననీ, వందలకొలది పజిల్సు దేశంలో పుట్టి ప్రజలసొమ్ము దోచేస్తున్నవనీ, మీ ఆడవాళ్లుగూడా వీటి పిచ్చిలోబడి డబ్బు నాశనంచేయడంకంటె రాట్నమువంటి ఏ గృహపరిశ్రమో యింటబెట్టుకొని తీరుబడి సమయంలో రోజూ కాస్త నూలు తీసుకున్నామంటే ఈ గుడ్డకరువురోజుల్లో సంసారానికి ఎంతో ఫాయిదాగా ఉంటుందనీ ఎన్నో విధాల చెప్పారు. నేను ఎంతో కష్టపడి వ్రాశాను. ఈతడవకు కట్టండి మళ్లీ మిమ్మలను కోరనంటే, నాకివ్వంటే యిష్టంలేదు, నీ అఘోరింపు చూడలేక కట్టవలసివచ్చిందంటూ తీసుకవెళ్లారు.

రాజే :- మావారూ చాలా చర్చచేసే తుదకు తీసుకవెళ్లారు.

కమ :- నిజమేనండీ. మా అన్నయ్య చెప్పాడుగా. మహామహా చదువుకున్న మగవాళ్లే వందలకొలది డబ్బు దీనికోసం వెచ్చబెట్టి ఓడిపోతూ ఉంటారుటండీ.

రంగ :- నేను వ్రాసింది తప్పకుండా గెలుస్తుందని నా నమ్మకం.

రాజే :- నాదీ ఓడటానికి అవకాశంలేదు. శబ్దరత్నాకరం, ఆంధ్రనామసంగ్రహం దగ్గిరపెట్టుకొని ప్రతిపదమూ చూచిచూచి వ్రాశాను.

కమ :- మనమేనా? వ్రాశేవాళ్లందరూ అట్లాగే వ్రాయరూ? అయినా జయమెవరికో!

రంగ :- అబ్బో, సందెపనులకు వేళైనట్టున్నది. వెళ్లివస్తా.

కమ :- నేనూ వస్తున్నా.

రాజే :- వెళ్లకండి. బొట్టుపెట్టి తాంబూలమిస్తాను. (రాజేశ్వరి బొట్టు తాంబూలమివ్వగా వెళ్లివస్తామండీ అని యిద్దరు వెళ్లుతారు.)

### 3వ రంగము

### ఉదయం తొమ్మిది గంటలు

రాఘ :- (కచ్చేరి సావిట్లో పచారుచేస్తూ) రాజేశ్వరీ! మీ పజిల్సు రిజల్టు తెలిసేది యివ్వాళేగాదూ? (అంటూ ఉండగానే పోస్టుజవాను వస్తున్నాడు)

జవాను :- అయ్యా, ఇదిగో టపా.

రాఘ :- (రాఘవరావు టపా చూస్తుండగా రాజేశ్వరి వేగంగావచ్చి) అదే పజిల్సున్న పేపరు, చూడండి. లేకపోతే నేను చూస్తా యివ్వండి.

రాఘ :-ఎందుకు? ఒక్క క్షణంలో నేనుచూస్తా ఉండు. నీపేరు మొదటివరుసలోనే ఉంటుందిగా (చూచి) రాజేశ్వరీ! నీపేరు మొదటివరుసలో లేదేం!

రాజే :-బాగా చూచారా ?

రాఘ :-మొదటి బహుమానార్హులలో మూడే పేర్లున్నవి. వారు ముగ్గురూ మొగవాళ్లే.

రాజే :-ఒక్క తప్పున్న లిస్టు చూడండి.

రాఘ :-ఊఁహూఁ అందులోనూ లేదు.

రాజే :-రెండు తప్పులున్న దాంట్లోనో.

రాఘ :-అందులోనూ సున్నే.

రాజే :-మూడు తప్పులున్న జాబితా చదివారా ?

రాఘ :-ఆఁ అదీ చూచా. ఎక్కడా కన్పడలేదు. పాపం రంగనాయకమ్మగారి పేరుగూడా లేదే.

రాజే :-మెరిట్ బహుమానాల్లోనైనా ఉన్నదేమో.

రాఘ :-ఇంకా పిచ్చిఆశ యెందుకు పెట్టుకుంటావు? మెరిట్‌లో లేదు గిరిట్‌లో లేదు, రెండురూపాయల నాలుగణాలు మసి. నీకింకా అనుమానం తీరకపోతే తీరుబడిగా కూర్చొని చదువుకో.

రాజే :-ఏదీ, పజిల్సు ఎట్లా పూర్తిచేయబడ్డవో చూస్తా ఉండండి. (పేనిమిటి చేతిలో పత్రిక అందుకొని) అమ్మో! ఈ అపశబ్దాలు చూచారా? గొడుగుకు - గొడువుట, అభిమానమునకు - అభిమాతముట, ఇటువంటివే నాలుగైదున్నాయి చూచారా? ఇవి యే నిఘంటువులోనైనా ఉన్నాయా ?

రాఘ :-ఏమైతేనేమి, మేనేజరు తీర్పుకు బద్ధులమని వ్రాసియిచ్చారుగా?

రాజే :-పదములు మార్చేయడంలోకూడానా ?

రాఘ :-ఆ అన్నిహక్కులు మేనేజరువే.

రాజే :-ఇది కేవలం అన్యాయం. వాళ్లు సరియైన పదములు వాడినట్లైతే నా పజిల్ యేమాత్రం తప్పేదికాదు. రంగనాయకమ్మగారుకూడా ఓడేవారుకారు.

రాఘ :-మీకు న్యాయప్రకారం బహుమానార్హత ఉన్నట్లైతే వాళ్లు ఒకసూచన చేశారు చూచావా? దీనినే స్క్రూటినీ హక్కు అంటారు. అయిదురూపాయలు ఫీజుకట్టి తమ అర్హతను సూచిస్తూ వ్రాస్తే న్యాయమని వారికి తోస్తే ఆ బహుమానమిస్తారుట, కాదనుకుంటే యివ్వరట. పైగా ఆ అయిదు రూపాయల ఫీజుగూడా ఆ పజిల్ వారికే చెందుతుందిట. ఏమి, వ్రాస్తావా ? యేమిటి ?

రాజే :-సరి సరి. ఈ గుణపాఠం చాలు, ఇంకానా ?

రాఘ :-మంచి రిట్టువాచీ వచ్చే ఛాన్సు పోయింది రాజేశ్వరీ!

రాజే :-అబ్బా! ఊరుకోండి. సమయాసమయాల్లేకుండా పరిహాసం!

# హింస — అహింస

[ భారతీయ మతధర్మ సంప్రదాయముల ననుసరించియు, మహాత్ముల బోధల ననుసరించియు, ఉత్తమ ప్రేమాదర్శము ననుసరించియు "అహింసయే పరమధర్మ"మగుచున్నది. అది ఉత్తమ మానవత్వమునకు నిదర్శనము. గత 20 యేండ్లపైగా గాంధీజీ అహింసాతత్వము గూర్చి మహోపదేశములు సాంగోపాంగముగా చేయుచున్నాడు.

అయినను ఈ యుద్ధకాలములో, దేశరక్షణాది సమస్యలు రాగానే భారతీయులలో సంశయాత్ములలో మరల ఈ సమస్యపై జిజ్ఞాస బయలుదేరినది. కాంగ్రెసునుండి మున్షీ ప్రభృతుల రాజీనామాలతో అహింసావాదముపై తర్క మారంభమయినది.

కృష్ణవేణమ్మగారి ఈ వ్యాసము ఆంధ్రస్త్రీలలోను ఈ ప్రశ్నపై తర్జన భర్జనలు పురిగొల్పుచున్నది. ]

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

'అహింసాపరమోధర్మః' మన శృతిపుటంబులఁబడుచునే యున్నది. హింసించుట పాపమని యందురు. 'పాపాయపరపీడనమ్!'. కేవల మహింసాతత్త్వము నవలంబించుటయు క్షేమకరము కాదని తేలుచున్నది. హిందూధర్మశాస్త్రము లహింసాతత్త్వమును ప్రతిపాదించుచున్నవి. ప్రపంచమున నొక్క హిందూ ధర్మమేగాదు; క్రైస్తవ, మహమ్మదీయాది ప్రముఖ మతప్రవక్తలును హింస యకార్యమని యుద్ఘోషించిరి. అహింసాతత్త్వము సర్వమత ధర్మములలో నంతర్భూతమైయున్నను బుద్ధదేవుడు దానికిఁ ప్రాధాన్యమునిచ్చి ప్రచారము సాగించెను. తదనుచరులు బౌద్ధమతావలంబకులైరి. బౌద్ధమతము ప్రజాదరణవడసినది. సార్వభౌములుగూడ తద్ధర్మసూత్రములకు దలలూచిరి. ధర్మ ప్రచారమునకు నడుముకట్టి నిలిచి దోహదమొనర్చిరి. ఖండాంతరవాసులకును బౌద్ధమత తేజము మిఱుమిట్లు గొల్పినది. తామరతంపరగా బౌద్ధలత నలుదెసలకుం ప్రాకిపోయినది.

చక్రవర్తు లహింసా సూత్రముల శిలాక్షరములతో వ్రాయించిరి. స్తూపములు, విహారములు నేటికిని సాక్ష్యమిచ్చుచునే యున్నవి.

బౌద్ధమతసిద్ధాంతము లెంతవఱకుఁ గార్యరూపము దాల్చియుండెనో మన మెఱుంగము. అశోక చక్రవర్తి పశ్చాత్తప్తుడై యుద్ధమును మానుకొని బౌద్ధమత మవలంబించెనని చరిత్ర మనకు చెప్పుచున్నది.

ఇటీవల మహాత్ముడు దీని ప్రాముఖ్యతను గ్రహించినాడు. అహింసాతత్త్వము సర్వోత్కృష్టమని హెచ్చరించుచున్నాడు. హింసయా అహింసయా యను గొప్ప ప్రశ్నార్థకచిహ్నము మన యెదుటఁబడినది. కొండలవంటివారు సైతము తమలో దాము డీకొనుచున్నారు. అనభిజ్ఞనగు నే నీ విషయముఁదాకుట సాహసమే గావచ్చును.

హింస శారీరకమో, మానసికమో, కావచ్చును. హింసింపక సిద్ధినైనను బొందుట దుర్ఘటము. లఘుతరమగు చిన్నికోర్కెకును హింసింపవలసియుండును. హింసకు స్వార్థము కారణమనవచ్చును. స్వార్థమునకు హింస కార్యము. అది వానికిఁగల కార్యకారణ సంబంధము. స్వార్థమే లేనియెడ హింసకు తావుండదు. మునుపు ముక్తసంగులైన మునులు వనములలో నహింసావ్రతము నాచరించుచుండిరి. ప్రపంచముతో నేకొద్ది సంబంధమున్నను నిది దుస్సాధ్యము. కాని కొంతవఱకహింస వీలగును.

స్వార్థమునకు హింసాచరణము పశు పక్ష్యాదులలోఁగూడ గాననగును. స్వయం రక్షణకు హింస ముఖ్యావసరమని భగవంతుని యభిప్రాయము గాఁబోలు. స్వీయసంరక్షణ కుపకరించు సౌకర్యములన్నియు నాయాశరీరులకు బ్రసాదించియున్నాడు. ఆవులు మొదలగు వాని కేల కొమ్ములనిచ్చెనో యూహింపవచ్చును. కొన్నింటికి కోఱలు. ఇట్లే తత్తదనుగుణ్యముగ నన్నిఁటికొసంగెను. స్వయంరక్షణకు హింస కర్తవ్యమని వ్యాసుఁడును, మనువు నభిప్రాయపడిరి. ఇండియన్ పీనలుకోడు చట్టమునకూడా, 'స్వీయరక్షణకై గావించిన హింస నేరము కాద'నియున్నదందురు. హింసను హింసచే నెదుర్కొనవలెననుట చాలమంది యభిప్రాయమై యున్నది.

కుక్క అల్పప్రాణి. దానిపైఁ జేయెత్తిన నది గుఱ్ఱుమనును. అన్నింటి నహింసచే నెదుర్కొనవలయునను మహాత్ముని మతమూహకందదు. చాలమంది కది స్వభావవిరుద్ధమని తోపవచ్చును.

మహాత్ముఁడు హింసను అహింసచే నెదుర్కొనవలయునని కొన్ని పద్ధతుల సూచించెను.

ముఖ్యావసరమైననేగాని శారీరక హింస ఘోరమే. 'పైబడి హింసించు ఘాతుకునైనను శాంతముగా నహింసతో నెదుర్కొనుడు. ప్రాణత్యాగమునకైనను సిద్ధపడి యహింసా ధర్మము నాచరించుట ముఖ్య'మని మహాత్ముఁడనును. విరోధిని ద్వేషించుట కంటె ప్రేమించిన ఫలితము ద్విగుణమనియు బోధించును. శాంతి సమయములలో నొకరినొకరు ప్రేమించుకొని జీవితముల గడపుకొనుట ప్రజలకు గర్తవ్యము. క్షేమకరము. సహనము, పొరుగువానిపై ననురాగము, జాతీయ బలిమికి మూలాధారము. జాతీయైక్యతకు రాచబాట. కాని స్వసంరక్షణకు, విప్లవము లణగద్రొక్కుటకు, నహింసా పద్ధతి యని మహాత్ముడు చాలదూరము పోవుచున్నాడు.

మనపరిస్థితి కహింస మిక్కిలి యనుకూలించినది. నెత్తుటిచుక్క చిందకుండ కాంగ్రెసు పోరు సాగించుచున్నది. అపారనష్టము కూర్పుచున్నను పాలకులీ శాంతిసేననెదుర్కొన వలసియే యున్నది.

దేనికైనను బరిమితి ప్రకృతిసిద్ధము. అపరిమిత మనర్థదాయకమే యను విషయమందఱెఱింగినదే. అహింసను మహాత్ముఁడు చెప్పినంత దూరము తీసుకొని పోలేక కాదు. పోవసాధ్యముగాక పూనాసభలో నాయకులకు మహాత్మునకు పట్టింపులు వచ్చినవి. శాంతి రక్షణకు స్వపరిరక్షణకు హింస కొంతవఱ కావశ్యకమని వారభిప్రాయ పడిరి. మహాత్ముడు పోయినంతదూరము సామాన్యు లహింసతో బోలేరు. హింసాహింసల భేదాభిప్రాయముననే మున్ను మంత్రిగనుండిన శ్రీ కే. యం. మున్షి కాంగ్రెసునుండి రాజీనామా నిచ్చెను. 'అహింస వీలుకాదు. హింసతోనే మాప్రాణ, మాన, ధనములు రక్షింపఁబడునని యెవరికి దృఢ విశ్వాసముకలుగునో వారు కాంగ్రెసును వదలుటకు సంపూర్ణ స్వాతంత్ర్యమును కలిగియున్నారు.' అని మహాత్ముఁడు వ్రాసెను.

మతకలహముల నంతరింపఁజేయుటకు శాంతినెలకొల్పుటకు నహింసయే కార్యమనియు నందురు. కాని వెనుకనుండి హంతకుండు వచ్చి నిరపరాధులఁ బొడిచి పాఱిపోవుచుండుట యీకలహముల ప్రధానాంశము. హింసతోగాని, యహింసతోగాని యెదుర్కొనుటకు హంతకుఁడేడి? 'తమ్ముఁతాము రక్షించుకొనలేనివారు తమ ప్రాంతముల వదలి గ్రామాంతరములకు వలసవెళ్లుట శ్రేయస్కరమని' మహాత్ముఁడే సింధుదేశ మతకలహములు తీవ్రముగా సాగుచున్నప్పుడు సలహానిచ్చెను.

హింసాహింసల రాజకీయములతో మేళగించి గాంధిగారేల కష్టింపవలయునో యించుక విచారింపఁదగియున్నది. మతసహనమునకు, జాతీయైక్యతకు, గ్రామపరిశ్రమాభివృద్ధికి, యహింసాపద్ధతి దోహదమొనర్చినట్లు మఱేదియు సహాయకారికాదు. ముఖ్యముగా దేశీయుల హృదయముల మహాత్ముఁడు ప్రేమచే గెలిచి తన నిర్మాణకార్యక్రమము (constructive programme) సాగించుచున్నాడు. ఈ కార్యక్షేత్రమున మహాత్ముని యహింస బ్రహ్మాస్త్రమై పాఱినది. దేశసంరక్షణ, శాంతిస్థాపనల కీ యహింస యెంతవరకు పనికివచ్చునో దురూహ్యము. "Mahatma Gandhi has for a long time preached that violence should not be used even in the exercise of the right of private defence. I have always differed from him on this point. Mahatma Gandhi's preaching has produced a great effect on the minds of large numbers of people. But I believe the bulk of them would if consulted say on the basis of experience that it is a reasonable provision of law which permits people to protect themselves by meeting violence with violence where necessary" అని మాలవ్యాపండితుడు హిందూనాయకులతో ముచ్చటించుచు నుడివియుండిరి. జాతీయరంగమునను, స్వాతంత్ర్యసాధనకును అహింస యనుకూలించునని నేను మహాత్మునితో నేకీభవింతును. పరదేశ దండయాత్రలకు, స్వదేశములోని విప్లవముల నణగద్రొక్కుటకు 'అహింస' స్వభావ విరుద్ధమనిపించును. నిష్కారణ హింస రాక్షసత్వమునకు నిదర్శనము. యీ విషయమున నెన్నెని వాదములున్నను నిర్ధారణచేయ సమర్థులెవ్వరో? ఈ సమస్యలో యాంధ్రసోదరీమణుల యభిప్రాయమేమో!

'అహింసా సత్యమక్రోధ................
భవన్తి సంపదం దైవీ మభిజాతస్యభారత!'

గీత. ౧౬ అధ్యా. ౨, 3 శ్లో.



యెదుట నడుచుటకు కాళ్ళు వొణుకుతూ, అడుగులు తడబడుతూ నడుస్తారు; పురుషులున్న సభల్లోకివెళ్ళి కూర్చోవటానికి గుండెచాలదు; అథవా కూర్చున్నా ఏదో పెద్దతప్పుచేసినవాళ్ళలాగానే గాభరా చెందుతారు; భయపడతారుగూడా. ఇంతేందుకూ? ఆకలై మాడిచచ్చే స్థితిలోవున్నా మగవాళ్ళకంటే ముందుతినటం తప్పుగా భావించే హీనస్థితిలోవున్నారు. పెద్ద పెద్ద వ్యవహారాల్లో గాకపోయినా స్వల్ప పనుల్లోగూడా స్వతంత్రించి బాధ్యత తీసుకోవటానికైనా యత్నించకపోవటం స్త్రీలకు అవమానకరమైన విషయం. నిజంగా ఇట్టి స్వల్పవిషయాల్లోగూడా స్వాతంత్ర్యం లేదంటే స్త్రీకి వ్యక్తిత్వమేలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. పురుషులు స్త్రీలను ఇట్లు తమచెప్పుచేతల్లో వుండేటట్లు వేల సంవత్సరాలనుండి వారికి ధర్మాలు, నీతులూ, కపటమైనవి కల్పించి, హక్కులూ అధికారాలూ ఏవిధమైనవీ లేకుండాజేసి తమ స్వంత పనిముట్లవలె, తమ దొడ్లో పశువులవలె వాళ్ళ మీద హక్కులు సంపాదించుకున్నారు; బానిసలుగా వినియోగించుకున్నారు; వినియోగించుకుంటున్నారుగూడా.



## ★ విద్యాలోపం

మన దేశంలో నూటికి ఇద్దరు స్త్రీలు, అక్షరాలు వచ్చినవారితోగూడా, చదువుకున్నవారు. ఇట్టిస్థితిలో వీరు తమ బానిసత్వాన్నిగూడ గమనించలేక పోతున్నారనడంలో ఆశ్చర్యమేముంది? ఈ కారణంతోనే పురుషులెన్నివిధాల కొట్టినా, తిట్టినా, నానా విధాల అవమానిస్తూవున్నాగూడా అది తప్పుగాకూడా భావించకుండా, స్త్రీలు వాటిని అనుభవించటమే ధర్మంగా - పరమధర్మంగా - పైగా పతివ్రతలైన ఉత్తమ స్త్రీల లక్షణంగా కూడా భావిస్తున్నారు. పురుషులేమి చేసినా సరే వారిమాట జవదాటక, వారి ననుసరిస్తూ వుండటమే పరమధర్మంగా కూడా స్త్రీలు భావిస్తున్నారు. ఇంతకంటే అజ్ఞానం, నీచత్వం ఇంకొకటి వుండబోదు. ఇవన్నీ సవరించుకునే ఆలోచనలే లేకపోవటం (అత్యధిక సంఖ్యాకుల్లో) స్త్రీల విద్యాలోపమే.

స్త్రీలల్లో విజ్ఞానంవుంటే, ఆలోచనలేకుండా, మితంలేకుండా, ఆదాయాన్ని గుర్తించకుండా తమ విలాసవస్తువులకు, చీరెలకు, నగలకు, అనవసరమైన దుర్వ్యయంచేస్తారా? అతివిలాసాలతోను, వ్యర్థ ప్రసంగాలతోను కాలాన్నంతా వృధాగా పోగొట్టుకొంటూరా? ఇంట్లో అవసరాలేవో, అనవసరాలేవో తెలియక, అవసరమైన వాటిని కొనుక్కోకుండా (డబ్బున్నవారుకూడా) అవసరంలేనివాటికి డబ్బుఖర్చు పెడుతూవుంటూరు. బీదసంసారాల్లోగూడా పూర్తిగా యీ దృష్టే వ్యాపించివుంది. పురుషుల్లో సంఘసంస్కర్త లెవరైనా మూఢాచారాలను, అనాచారాలను సంస్కరించబోతే, అమ్మా ! పూర్వాచారాల్ని వదలిపెట్టటానికి వీల్లేదనీ, మా అమ్మాయికో అబ్బాయికో అయిదురోజుల పెళ్ళి గావాలనీ, అర్వీణలేందే

వల్లగాదనీ, బాజాబజంత్రీలు, కాళ్ళగోళ్ళు తీయటం వుండవలసిందేనని, దేవుళ్ళకు, దయ్యాలకు పెట్టవలసిందే ననీ ఇట్టి అనేకమైన గృహవ్యవహారాల్లో మంచిచెడ్డలు, లాభనష్టాలు తెలుసుకోకుండానే అడ్డు తగుల్తూ వుంటారు. మనదేశంలో ఈనాటికికూడా అనేక మూఢాచారాలు పాతుకుని వున్నాయంటే, దానికి అజ్ఞానవతులైన స్త్రీలే చాలావరకు కారణం.

## ★ ఇతర దేశాల్లోని స్త్రీలు

ఇటలీ, జర్మనీ, ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా, అమెరికా, జపాను మొదలైన దేశాల్లోని స్త్రీలు నూటికినూరు, తొంభై, ఎనభై వరకూ చదువుకున్నవారు కాబట్టి పురుషుల్తోపాటు తామూ మనుష్యులమే అనే భావంతో వుండుటయే గాక వారితోపాటు అనేక హక్కులుపొంది సుఖజీవనం చేస్తున్నారు. సైనికుల్లో, పోలీసుల్లో, కార్ఖానాల్లో, కోర్టుల్లో, స్కూళ్ళల్లో మరి యితరమైన అన్ని శాఖల్లోనూ గూడా అధికార పదవుల్లో పనిజేస్తున్నారు. హైందవస్త్రీలలాగా వ్యక్తిత్వాన్నే గోల్పోయి (పాటకజనం తప్ప) పురుషులు పెడితే తిని, లేకపోతే ఏడుస్తూ కూర్చోక, పురుషుల్తోపాటు అనేక హక్కులుపొంది సర్వకార్యాలూ నెరవేరుస్తున్నారు. మనస్త్రీలలాగా ఘోషాఅనే పేరుతో పురుషుల కంటబడకుండా ఎందుకూ పనికిరాని పశుసమానులుగా వారు తయారుగాలేదు. పురుషులంటేనే పులిని చూచిన మేకపిల్లల్లాగా గజ గజ వొణికే మన స్త్రీలలాగా వారు భయంచెందరు. పురుషుడే సర్వస్వము; పురుషుడే దైవము; పురుషుడు మనకంటె గొప్ప అనే భావం ఇతరదేశ స్త్రీలకు ఎన్నడూ తోచని విషయం.

## ★ బానిసత్వం

రాగా రాగా స్త్రీల బానిసత్వం, చదువుకున్నవారిలో గూడా, భర్తలపేరు తోడుజేసుకుని తప్పితే తమ సొంతపేర్లతో బయటికి రాలేనంతటి హీనస్థితిలోనికి వచ్చింది. ఇది ప్రపంచం అంతటా వ్యాపించివున్న, నాగరికతా రూపమైన, బానిసత్వాన్ని నిరూపించేటటువంటి ఒక దురలవాటు. సభల్లో స్త్రీలను పరిచయం చేసేటప్పుడుగూడా పేరుచెప్పకుండా గూడా 'ఫలానావారి సతి' అని చెప్పటంగూడా తరుచుగా చూస్తున్నాం. ఇది చాలా అవమానకరం. అలవాటు బడిపోయిన కారణంచేత అనిపించుకునే వారికిగూడా ఏమీ చెడ్డగా తోచుటలేదు. సామాన్యంగా పురుషులు ఎక్కువగా చదువుకున్నవారై అనేక ఘనకార్యాల్లో పేరుపొందినవారై వున్న కారణంచేత వారిపేరు లోకంమీద వ్యాపించి వుంటుంది. అటువంటివారి భార్యలు ఏమిచేసినా చేయకపోయినా, సమర్థురాండ్రైనా కాకపోయినా, భర్తల పేర్లతో, త్వరగా నలుగురికీ తెలియటానికి ఏర్పడిన అలవాటు ఇది. కాని, వ్యక్తిత్వం స్వాతంత్ర్యంయొక్క విలువ, దెలిసిన స్త్రీకి ఇంతకంటే అవమానం ఇంకొకటివుండదు. పురుషుల మాదిరిగానే తన శక్తిసామర్థ్యాలవల్ల, కార్యదీక్షవల్ల, గొప్ప గొప్ప పనులవల్ల స్త్రీయొక్క పేరు బయటికి రావాలిగాని భర్త గొప్పతనాన్ని వుపయోగించుకునిగాదు. నిమ్నజాతు లనబడేవారు, అగ్రజాతు లనబడేవారు ఎన్ని తిడుతున్నా, అలవాటు ప్రకారం గొప్పవారు మనలను తిట్టావచ్చు, కొట్టావచ్చు, మనం పడావచ్చు అనే భావంతో నేటికీ ఎట్లావున్నారో అట్లే స్త్రీలుకూడా వున్నారు. ఈ విషయంమీద, నేనింత గట్టిగా ఎందుకు వ్రాస్తున్నానంటే, స్త్రీ హృదయంలో తన ప్రత్యేక వ్యక్తిత్వం, స్వాతంత్ర్యంయొక్క విలువ, దాస్యంలోని నీచత్వం, తుదకు నేనూ

మనిషినే, నాకూ పురుషులకుండవలసిన హక్కులుండవలసిందే అనే తీవ్రమైనభావం పుడితేనేగాని మన స్త్రీ జాతి అభివృద్ధికి రాజాలదు.

ఇట్లాఅనడంలో పురుషులు మంచీ చెడ్డా ఏదిచెప్పినా వినకుండా, స్వేచ్ఛా విహారిణులై, భర్తలకు ఎదురుతిరగమని నా వుద్దేశంగాదు. స్త్రీలల్లోవున్న పైజెప్పిన అతిబానిసత్వాన్ని వొదిలిపెట్టి, సర్వ విషయాల్లోనూ స్వతంత్రత పొంది, స్త్రీ పురుషులు పరస్పరసహకారంతో, పరస్పర గౌరవ మర్యాదల్తో, సమానమైన సుఖజీవనాల్తో జీవయాత్రను సాగించటమే నా పరమోద్దేశం.

★ తీర్మానం

ప్రపంచంలో ఏ విషయంలోనైనా సరే సంస్కరణ జరగాలన్నా, అభివృద్ధి పొందాలన్నా, ముందు చదువుకున్న వ్యక్తులు దారితీసి ప్రయాణంసాగించాలి. తర్వాత వారివెంట సామాన్యప్రజ నడుస్తూవుంటుంది. ఇది పరిణామం చెందుతూవున్న మానవచరిత్రలో లోకసామాన్యమైన ధర్మం. కాబట్టి స్త్రీల వ్యవహారాలు స్త్రీలే సరిజేసుకోవాలిఅంటే, చదువుకొన్న స్త్రీలమీద ముందుమార్గాన్ని చూపించే బాధ్యత వుంది. అందుకుగాను, పైనజెప్పినట్లు జంటపేర్లను వాడటం మానివేసి, తమ స్వంతపేర్లను ఒక్కదానినే వాడే అలవాటును తీసుకురావాలి. దీనికొరకు ఏ శారదా బిల్లులాగానో చర్చోపచర్చలు జరిపి బిల్లు ప్యాసు చేయవలసిన అవసరంగాని, తీవ్రమైన ప్రతి ఘటనగాని యేవీలేవు. ఇది మన చేతిలోవున్న స్వల్పవిషయం. తాలూకా, జిల్లా, రాష్ట్ర మహిళాసభల్లోనే కాకుండా అఖిలభారత మహిళాసభలో దీనికి సంబంధించిన ఒకతీర్మానం పెట్టి, తీర్మానించటం అవసరం. అప్పుడది భారతదేశానికంతటికీ వర్తించును. ఆ తీర్మానాన్ననుసరించి మన దేశంలోని పత్రికాధిపతులకు గూడా ఇకముందు ఇటువంటి జంటపేర్లను పత్రికలలో ప్రకటించవలదని ఒక తీర్మాన రూపకమైన సూచనను అందజేస్తే వారుగూడ తమపూర్వశైలిని మార్చుకొంటారు. ఇందులో ఎవరికి ఏవిధమైన కష్టమూ లేదు.

వచ్చే డిశంబరులో అఖిలభారత మహిళాసభ రాజమండ్రిలో జరుగుతుంది. దానిలో నేను పై జంటపేర్లకు సంబంధించిన తీర్మానాన్ని ప్రతిపాదింప దలంచుకొన్నాను. ఈ తీర్మానాన్ని నా సోదరీమణులంతా సమ్మతిస్తారని నమ్ముతున్నాను.

పురుషుల్తోపాటుగా ఆస్తిలోనూ, వివాహాల్లోనూ, విడాకుల్లోనూ స్త్రీలకి కూడా సమాన స్వాతంత్ర్యంవుంటేనేగాని నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లుగాదు. ఈ చిక్కులన్నిటికీ మూలకారణం తండ్రి ఆస్తిలో కొడుకుతోపాటు కూతురుకి సమభాగం లేకపోవటమే. ఆర్థిక హక్కులంటే అన్నీ దాని వెనువెంట పరిష్కారంకాగలవు. ఇటువంటి విషయాలన్నింట్లో మనం చూస్తూ వూరుకుంటే మనకీ బానిసత్వం శాశ్వతంగా వుంటుంది. కొంత కొంత స్త్రీజాతీ, పురుషజాతీగూడా మేలుకొంది. అయినా ఇంకా మనం పొందవలసిన అనేక హక్కులకొరకు తీవ్రమైన ఆందోళన జరపాలిసేవుంది. ఒత్తిడిలేందే ఏపనీగాదు. నా సోదరీమణులంతా బానిసత్వాన్ని నిర్మూలించి మేమూ మనుష్యులమే అనే ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోవటానికి శక్తివంచనలేకుండా కృషిచేస్తూ అలజడిజేస్తారనే నమ్ముతున్నాను.

# పులిచర్మము

"విజయ"



రాంచీనుండి చక్రధరపూరువరకు 75 మైళ్లు దట్టమైన అడవి. యీ అడవిలో అనేకజాతి జంతువులు గలవు. అన్నిటికన్నను పెద్దపులులు చాలా యెక్కువ. ఇది కొన్నిసంవత్సరముల క్రిందటి సంగతి. నేను, నా స్నేహితుడు, రాంచీ హైస్కూలులో చదువుకొనుచుంటిమి. మా నివాసస్థలము చక్రధరపూరు. డిశంబరు శెలవులకు మేము యింటికి బయలుదేరవలసియుండెను. శెలవు కొద్దిరోజులే గనుక, స్కూలు మూసిన రోజే బయలుదేరుటకు నిశ్చయించుకొంటిమి. అక్కడ రైల్వేలైను లేదు. ఒక మోటారు బస్ సర్వీసు మాత్రము ఉండెను. దురదృష్టమువల్ల మాకు ఆరోజు బస్సులో స్థలము దొరకలేదు. ఆఖరుకు మేము మా సైకిళ్లమీద వెళ్లుటకు నిశ్చయించినాము. లెక్కచూడగా యెక్కడను ఆగకుండా ప్రయాణము చేసినయెడల 9, 10 గంటలలో యిల్లుచేరవచ్చును. సాయంకాలము భోజనముచేసి, కొంత 'టిఫిను' కూడా తీసుకొని, 6 గంటలకు బయలుదేరితిమి.

అవి వెన్నెల రాత్రులు. ఒకమైలు వెళ్లగానే చుట్టుప్రక్కల కొండలు అగుపడసాగెను. కొండ వాగు ఒకటి నెమ్మదిగా సాగిపోవుచుండెను. చెట్టుక్రింద వెన్నెలఛాయలు, బహుకష్టముతో ప్రవేశించుచుండెను. మా సైకిలు చక్రములు యెండుటాకులపైనుండి గలగల శబ్దముచేయుచు దొర్లిపోవుచుండెను. దగ్గర దగ్గరలో అడవిజాతివారి పల్లెలు తగులుచుండెను. వారి గుడిసెలలోనుంచి డోలు, పిల్లనగ్రోవియొక్క మధుర శబ్దము వినిపించుచుండెను. మేము యీ దృశ్యమును చూచుచు సంతోషముతో ప్రయాణము చేయుచుంటిమి.

యింతలో అకస్మాత్తుగా నా స్నేహితునికి మూర్ఛవచ్చి సైకిలుతోకూడా క్రింద పడిపోయెను. తలవని తలంపుగా యిట్లు జరుగుట చూచి నా గుండె ఆగిపోవుచున్నట్లు తోచెను. యిప్పుడేమిచేయుట? దగ్గరలో ఒక పల్లెకూడా లేదు. భయంకరమైన నట్టడవి. నేను నా స్నేహితుని మెల్లిగా లేపి కూర్చుండబెట్టుటకు ప్రయత్నించితిని. గాని అతను బాధాసూచక దృష్టితో నావైపు చూచుట తప్ప నిక మాటకూడా మాట్లాడలేకపోయెను. అప్పటి అతని స్థితిచూచి నాకు దుఃఖమాగలేదు. కాని దుఃఖించి లాభమేమి? దగ్గరలో యే పల్లె అయినను వున్నదేమో చూచి యెవరినైనా సహాయముచేయుటకు తీసుకొనివచ్చుట మంచిదని తోచినది. 'యిప్పుడు యెట్లున్న'దని నా స్నేహితుని అడిగితిని గాని జబాబు చెప్పలేదు. నాడికూడా సరిగాలేదు. శ్వాసము మెల్లిగా వచ్చుచుండెను. యిటువంటి స్థితిలో ఒంటరిగా అడవిలో విడచి వెళ్లుట యెట్లు? యేదైనా అడవిజంతువు నోటపడిన గుర్తుకు యెముకకూడా దొరకదు. కొంతసేపు ఆలోచించి రెండు సైకిళ్లను ఒక పెద్దచెట్టుకు దగ్గరగా నిలిపి, నా స్నేహితుని వాటిపై మెల్లిగా పరుండబెట్టితిని. కొంచెము మనసు కుదుటపరుచుకొని 'పల్లె' వెదుకుటకు బయలుదేరితిని. దారిలో స్నేహితుని స్థితి యెట్లున్నదో అని విచారము కలుగుచుండెను. చుట్టును భయంకరమైన అడవి. వెన్నెలకాంతికూడా చాలా కష్టముతో చెట్టుక్రింద కొద్దిగాపడుచుండెను. బాట సరిగా అగుపించుటలేదు. ఆకస్మికముగా నా కాలికి రాయితగిలి పడిపోయితిని. కాలికి కొంచెము దెబ్బతగిలినది. అట్లే మెల్లగా లేచి బయలుదేరుచుండగా వెనుక యేదో శబ్దము

వినిపించినది. తిరిగిచూడగా 15 గజముల దూరములో ఒక పెద్దపులి వచ్చుచుండెను. నా ప్రాణము తిరిగి పోయెను. నేను నిలచిపోవుట చూచి అదికూడా నిలువబడిపోయెను. మరల ఒకవేళ అది పులి కాక, యేదైనా చెట్టునీడచూచి భయపడితినేమో నని అనుమానించితిని. యిట్లే ఆలోచనతో వెనుకకు తిరిగి చూచుచు నడచు చుండగా మరల పెద్దగర్జన వినబడెను. పులి నావెనుక మెల్లిగా నడచి వచ్చుచుండెను. యీసారి నిజముగానే నా శరీరము కొయ్యబారిపోయెను. నేను అట్లే నిలచిపోతిని. నేను నిలచిపోవుట చూచి పులికూడ ఆగి పోయెను. యిప్పుడు నా ప్రాణములమీది ఆశ యెంతమాత్రములేదు. నావద్ద రివాల్వరుగాని, కత్తిగాని లేదు. చివరకు ఒక బెత్తముకూడా చేతిలో లేదు. భయంకరమైన నట్టడవిలో ఒక పెద్దపులియెదుట అసహాయస్థితిలో నిలువబడిపోయిన నాకప్పుడేమి చేయుటకును తోచలేదు. అనాలోచితముగా పెద్ద కేక వేసితిని. నా కేక వినగానే పులి లేచెను. అది లేచుట చూచి నేను మరింత భయముతో వణకసాగితిని. ఆ పులి మెల్లిగా అడవి లోనికి వెడలిపోయెను.

పులి వెళ్లుట చూచి నాకు చాలా ఆనందమైపోయెను. వీలైనంత త్వరలో పరుగెత్తుకొనిపోయి అందరితోను 'పులి యెవరికైనను అకస్మాత్తుగా కనిపించినయెడల గట్టిగా అరచుట మంచిఉపాయ' మని చెప్పవలె ననుకొంటిని.

సాధ్యమైనంత త్వరగా నడువసాగితిని. కొంతదూరము వెళ్లినతర్వాత, మరల యేదో శబ్దము విన వచ్చెను. చూడగా నాయెదుటనే 8-10 గజముల దూరములో ఒకపెద్దపులి నిలచియుండెను. పులిని బెదర గొట్టు మంత్రము నాకు తెలిసియేవున్నది. నా శక్తికొలది గట్టిగా అరవసాగితిని. యీపులి మాత్రము ఒక్క అంగుళముకూడా కదలలేదు. నా కేకలకు ప్రత్యుత్తరముగా తనతోకను గట్టిగా ఊపుచుండెను. నేను అట్లు యెంతసేపు నిలచియుంటినో నాకే తెలియలేదు. యింతలో మోటారు హారను శబ్దము వినిపించెను. మరల అది నాకు భ్రమగాతోచినది. నేను మెల్లిగా వెనుకకు నడుచుచుంటిని. 10 అడుగులు వేసితినో లేదో యింతలో పులి హఠాత్తుగా లేచెను. యిక నేను ప్రాణముమీది ఆశను వదలుకొంటిని. తలను గట్టిగా పట్టుకొని కన్నులు మూసికొంటిని. నేను వెనుకకు యెన్ని అడుగులు నడిచితినో పులికూడా అంతే ముందుకు నడచి అక్కడే కూర్చుండి, తోకను గట్టిగా విసురసాగెను.

తిరిగి మోటారు హారను వినబడెను. బహుశా రాంచినుండి యేదైనా లారీ వచ్చుచుండునని తోచినది. యింతలో పులి పంజా నా గుండెను అదిమివేసెను. 'అయ్యో చంపివేయుచున్నది' అని గట్టిగా అరచితిని. తర్వాత యేమైనది నాకు తెలియదు.

మరల నేను కన్ను తెరచునప్పటికి 'యురోపియను' తొడపై నాతలయుండెను. చుట్టును కొంత మంది జనులు ఆత్రముగా నావైపు చూచుచుండిరి. వారిలో నా స్నేహితుడుకూడా వుండెను. నేను త్రాగుటకు నీరుకావలెనని సైగచేసితిని. వారు నాచేత వేడిపాలను త్రాగించిరి. నాప్రాణము కొంచెము కుదుటపడెను.

క్రిందటిరాత్రి ఒక యూరోపియను యింజనీయరు తన ముగ్గురు, నలుగురు అనుచరులతో తాతా నగరమునకు వెళ్లుచుండెను. వారికి అడవిలో ఒకచెట్టుక్రింద రెండుకన్నులు మెరయుచుండెను. వెంటనే యింజనీయరుగారు 'అదిగో పెద్దపులి' అని తుపాకి యెత్తిరి. యింతలో మోటారు దీపముల వెలుతురు వాటిపై బడెను. చూడగా అవిరెండు సైకిలు దీపములు. వారు ఆశ్చర్యముతో, మోటారు ఆపి దగ్గరకు వెళ్లిచూడగా

వాటిపై ఒక యువకుడు మూర్ఛావస్థలో పడియుండెను. యూరోపియనువద్ద కొన్ని ఔషధము లుండెను. వాటిసహాయముతో ఆ యువకునికి కొంచెము నెమ్మది కలిగెను. వారు అతనిని కారులో కూర్చుండబెట్టుకొని బయలుదేరి వచ్చుచుండగా దారిలో ఒక పెద్దపులి నాగుండెపై రెండుపంజాలతో అదిమివేసియుండుట వారు చూచిరి. మోటారుశబ్దమును, దీపములవెలుగును చూచి పులి నన్నువదలి పారిపోవుచుండగా యింజనీరు, అతని అనుచరులు, తుపాకులు కాల్చిరి. పులి వెంటనే క్రిందపడిపోయెను.

నా గుండెమీద పెద్దగాయమైయుండెను. వారు ఆ గాయమునకు కట్టుకట్టి, వారిమోటారులో మమ్మును యింటికి చేర్చిరి. కొన్ని రోజుల తర్వాత, నా గాయము నయమై, మరల రాంచీకి వెళ్లితిని. ఒక రోజు మధ్యాహ్నము 'బెడ్డింగు' వంటి రైల్వే పార్సలు తీసుకొని ఒక కూలివాడు నాదగ్గరకు వచ్చెను. ఇంతలో ఒక ఉత్తరముకూడా వచ్చినది. పార్సలు వూడదీసి చూడగా అందులో 'పులిచర్మ' ముండెను. వుత్తరము యింజనీయరుగారు వ్రాసియుండిరి. నన్ను చంపబోయిన పులి చర్మము తన జ్ఞాపకార్థమై నాకు పంపితినని వ్రాసియుండిరి.

ఆ పులిచర్మము యిప్పటికిని నాదగ్గరేయున్నది.

---

# పెండ్లికూతురు

చిఱుత ప్రాయాన, పూలు కైసేసికొనుచు
నిష్కళంక మనమ్ముతో, నెనరుతో మ
దీయ ప్రాణప్రియుని జూడదలిసినాను!
తెలిసి యతని నలరించి, యలరినాను!

చెఱుపులేని నవ్యతలెల్ల సేకరించి
యల్లితిని పూలు; పూలలో నలరినాను
పూలమాలను చేబూని ముదము తొణక
అరిగితిని నాడు హృదయమందిరము పొంత.

పూలు కైసేత, నేనింక పూలరాణి
నతడు నా... రాజు: అతని యందు నేను!

పెనగొను ముదంబు సిగ్గుతో పెనగులాడ
చాటు చాటుగా, భావ కవాటమునకు
నిలిచి పరికించితిని, మనోనిలయు—తెలియ
బోని యేభావమో నాడు పులకరించె!

అడుగులో నడుగు, కాళ్లపట్టాల రవళి—
దేహము చలించె, చేతు లందించె ముద్ర;
నవ్వురాణించె, కన్నులు నవ్వె..., నేను
పూలరాణి నర్తకీ బాలనైతి!

అవశనైపోతి నానందభవనమందు
రాగధోరణిలో పూలు రాలిపోయె!

దళములను జేర్చి పుష్పాక్షతలు రచించి
విశ్వమున చల్లితిని భావవీధులందు
(అవి నివాళులై జన్మ జన్మాంతరముల
నాతనికొసంగు ప్రియాసమాగమాప్తి!)

"అతనికై పూలమాల, నేనతనికొఱకు:
అతడు నా కంఠమాల; నేనతనిబాల-"
పాలరానేలలో పూలమాల, నేను:
సిగ్గుతో ప్రేమతో సంతసిల్లినాను!

చిఱుత ప్రాయాన పూలు కైసేసికొని, మ
దీయ ప్రాణప్రియుని జూడదలిసినాను!
తెలిసి యాతని నలరించి యలరినాను!

'సుగుణ'



బొమ్మల కొలువు



"గరిక కోత"

(లీల, సరోజిని, సుభాషిణి, ప్రమీల, రామలక్ష్మి)

(ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ)

# ప్రేమ వేదిక మీద



శ్రీమతి చంద్రకాంతం

> సమాన ప్రతిపత్తితో కూడిన దాంపత్యానురాగమే శాంతి సౌఖ్యాల కాలవాలం. అది లేనినాడు?

మోహనరావుకు చిన్నతనంనుంచీ దేశసేవచేయాలనీ, దేశనాయకులను ఆరాధించాలనీ అభిలాషగావుండేది. కాని మోహనుని తండ్రి డిప్యూటీకలక్టరు అవడంచేత భయపడి మోహనరావును ఏవుద్యమంలోనూ పాల్గొననియ్యలేదు. తండ్రిగారే, మోహనరావు బి.యే. ప్యాసుఅయిన వెంటనే రాజమండ్రి మునిసిపలు కమీషనరుగా వేయించాడు. మోహనరావు జాలిహృదయం గలవాడు. బీదవిద్యార్థులు పడేకష్టాలు చూచి వారికి అనేకవిధాల సహాయంచేస్తూండేవాడు. తండ్రిగారు స్వర్గస్థులు అయిన తర్వాత మోహనరావు ఆవేశానికి ఏవిధమైన అంతరాయమూ లేకపోయింది.

మోహనరావుకు రాధ అనువైన భార్య. రాధతండ్రి జిల్లాజడ్జీపనిచేసి పెన్షను తీసుకొంటున్నాడు. రాధ చిన్నప్పటినుంచి అన్నివిధాలయిన అందచందాలు నేర్చుకొని బాగుగా విద్య నభ్యసించింది. భర్త దేశసేవచేస్తోంటే ఆమెకూడా అతనికి తోడ్పడుతోండేది.

ఇంతలోనే గాంధీమహాత్ముడు ఖద్దరు ప్రచారం ప్రారంభించాడు. మోహనరావు తన కమీషనరు పదవికి రాజీనామా ఇచ్చి ఖద్దరు ఉద్యమంలో ప్రవేశించాడు. నగరంలో నాలుగుమూలలకూ పోయి ఖద్దరు వ్యాప్తికి ఎన్నోవిధాల తోడ్పడసాగాడు. యువకుల నందరినీ ఉద్బోధించి ఖద్దరుయొక్క ప్రాశస్త్యాన్ని, ఆర్థికసంపదనీ గురించి నచ్చచెప్పేవాడు. ఖద్దరు బేళ్లు పట్టించుకొనిపోయి ఇంటింటా విక్రయిస్తోండేవాడు. అనేక ఖాదీ ఉత్పత్తి ప్రదేశాలకుపోయి వారికి ధనసహాయంచేసి ఉత్సాహపూరితం చేస్తోండేవాడు. ఖద్దరు సంరంభంలోపడి వేళకు తిండీ, కంటికి నిద్రా లేకుండా తిరుగుతోండేవాడు. దేశమంతా ఖద్దరుమయం కావాలనే మోహనరావుకు ఇంట్లోమాత్రం చిక్కుగా వుండేది.

ఖద్దరు ఉద్యమంలో మోహనరావు ఎంత ఆనందాన్ని పొందుతూ వుండేవాడో ఇంట్లో అంత విచారానికి కారణం అయ్యేది. రాధ ఖద్దరు కట్టడానికి సుతరామూ సమ్మతించలేదు. వారిరువురు ఎల్లప్పుడూ ఈవిషయమై తగువులాడుతూండేవారు.

మోహన:—రాధా! భారత భాగ్యవిధాత మహాత్ముడు ఖద్దరుకట్టమని ఉద్బోధిస్తున్నాడు. ఖద్దరు కట్టుకుంటే మనదేశీయులకు సహాయంచేసిన వాళ్లమవుతాము. మనదేశీయులు తిండిలేక మలమల మాడుతుంటే లంకాషైరు మిల్లుగుడ్డలను కొనడం ధర్మమా?

రాధ:—ధర్మంకాదు. మీకు అంతజాలిగా వుంటే దానంచెయ్యండి. మీరుకట్టుకోండి. మీ మిత్రులచేత కట్టించండి. నేనుమాత్రం ఆ ముతక నేతబట్టలు కట్టలేను. చాల బరువుగా వుంటాయి.

మోహన:—ఖద్దరులోనూ మెత్తని బట్టలున్నాయి. అందమైన బందరు కలంకారి అద్దకాలలో మంచిమంచి చీరలున్నాయి. పొందూరు ఖద్దరు, సీతానగరం ఖద్దరు, వినయాశ్రమం ఖద్దరు. చూడు, ఇప్పుడు గుణదల ఖాదీప్రతిష్ఠానంలో మంచిమంచి బట్టలు తయారుచేస్తున్నారు. నీ ఇష్టం వచ్చినది కట్టుకో.

కాని రాధ ఎంతచెప్పినా అంగీకరించలేదు. మోహనరావుకు కోపమూ, దుఃఖమూ కలిగాయి. అనేకమార్లు అడిగాడు. బ్రతిమాలాడు. ప్రార్థించాడు. అధికార పూర్వకంగా ఆజ్ఞచేశాడు. కాని ఏమీ లాభంలేకపోయింది. మోహనరావు కలెక్టరు కొడుకైనా రాధమాత్రం జడ్జీకూతురుకాదూ! మోహనరావుకు ప్రాణం విసిగిపోయింది. ఈదుఃఖం హృదయాన్ని వేధించసాగింది. ఒకనాడు ఏకాంతంగా కూర్చొని ఆలోచించసాగాడు.

'నేను హృదయ పూర్వకంగా ప్రేమించుతూన్న రాధ, నన్ను మనసారా ప్రేమించి నేనుచేయు దేశహితైక జీవితంలో చేదోడు వాదోడుగా ఉంటూన్న రాధ, ఖద్దరు కట్టడానికి ఒప్పుకోకపోవడం భావ్యంగాలేదు'_అని ఆలోచించి కొంతకాలం పుట్టింటికి పంపడానికి నిశ్చయించాడు. అందుచేత మానసిక ప్రవృత్తిలో పరివర్తన కలగడానికి అవకాశాలు ఉన్నాయని ఊహించి రాధను పుట్టింటికి పంపేశాడు.

విదేశవస్త్ర బహిష్కారం తీవ్రంగా సాగుతోంది. రోజురోజూ దేశసేవకులు అరెస్టు అవుతున్నారు. మోహనరావులో నూతనావేశం కలిగింది. విదేశవస్త్రాలయాలవద్దకు పోయి పికెటింగు ప్రారంభించాడు. వెంటనే అతనిని పోలీసులు అరెస్టుచేశారు. అతనిపై కేసుపెట్టి ఆరునెలలు 'సి' క్లాసు ఖైదు విధించారు.

ఈ వార్త పత్రికలలో చూచి రాధ చాల దుఃఖించింది. కాని కాంగ్రెసునాయకుల అభినందనాలను, ప్రశంసలనూ చూచి ఆనందించింది. తనభర్త జాతీయవీరుడని తలచి ఉబ్బిపోయింది. తాను తనభర్తను ఖద్దరుకట్టక కష్టపెట్టానని బాధపడింది. కాని ముతకఖద్దరు ఎందుకు కట్టాలో సమాధానపడలేకపోయింది.

రాధ మోహనరావు జెయిలునుంచి వచ్చేవరకూ పుట్టింటే ఉండిపోయింది. ఒకనాడు లోకమాన్యుని జీవితచరిత్ర చదువుతూండగా దాసీ రామి వచ్చి అంట్లువేయమని పిలిచింది. రాధ అటుచూడగా రామి పద్నాలుగోనంబరు ఖద్దరుచీర కట్టుకొనిఉంది. రాధ అదిచూచి అడిగింది—'రామీ, నీవు ఖద్దరుచీర కట్టావేం? బరువుగాలేదుటే? అందులోను ఓపలేనిదానివి. శుభ్రమైన మెత్తని మిల్లుగుడ్డలుండగా ఖద్దరు ఎందుకు?'

రామి:—అవునండమ్మా! గాంధీమహాత్ముడు ఖద్దరు కట్టమని చెప్పాడుట. అప్పటినుంచి కడుతున్నాం.

రాధ:—ఖద్దరు కట్టడం నీకు ఇష్టమేనా?

రామి:—నాకు ఇష్టమైనా కాకపోయినా, నా భర్తకు ఇష్టం. నా భర్త మిల్లు కూలీ. సమ్మె రోజుల్లో దేవుడులా కాపాడిన గిరిబాబు చెప్పాడుట. గాంధీ మనపాలిట భాగ్యదేవత. నాభర్త సంతోషంగా తెస్తే కట్టుకొంటున్నాను. అతనికేది సంతోషమో నాకూ అదే సంతోషం. నాభర్త ఆనందంతోనే నా ఆనందమూ ఉంది.

రామి చెప్పిన ఈ మాటలు వినగానే రాధ హృదయకమలం పూర్తిగా వికసించింది. వెంటనే వెళ్లి ఇంట్లోఉన్న విదేశీబట్టలన్నీ తగులబెట్టింది. ఒక్కసారే నూరురూపాయిల ఖద్దరు కొంది. అప్పటినుంచీ ఖద్దరు కట్టడం ప్రారంభించింది.

నాడు మోహనరావును వదిలేరోజు. కాంగ్రెసు సేవకులు బ్రహ్మాండమైన స్వాగతంతో జెయిలు వద్దకు పోయారు. ఉదయం ఆరుగంటలన్నరకు మోహనరావు జెయిలుబయటకు వచ్చాడు. 'గాంధీకి జయ్' అనే కేకలు మిన్నుముట్టాయి. మోహనరావు మిత్రుల నొక్కొక్కరినే పలుకరించసాగాడు. ఇంతలో రాధ ప్రత్యక్షమైంది. సన్నని పొందూరు గులాబీచీర కట్టి పచ్చనిపువ్వుల ఖద్దరు రవికతో చేతిలో పూలదండతో వచ్చి దండను మోహనరావు మెడలో వేసింది. మోహనరావు ఆనందవారిధిలో లీనమైపోయాడు. రాధ కనుకొలకులనుండి ఆనందాశ్రువులు రాలుతుంటే ఇలా ప్రశ్నించాడు.

'రాధా! ఖద్దరు బరువుకాదూ?'

రాధ:—అవును. ఖద్దరు బరువే! కాని కొద్ది బరువైన ఖద్దరు కట్టగానే దీర్ఘమైన హృదయభారం తగ్గింది.'

మోహనరావు 'అల్లాగా!' అంటూంటే అతని కండ్లనుంచి బొటబొట ఆనందాశ్రువులు రాలాయి.



## రావోయి!

విరహిహృదయ దురంతమిా వరవసంత
వేళ వనమాలి తరుణీశతాలి గూడి
నృత్యహేలాభిరతి విహరించుచుండె
హాయిగాఁ బ్రత్యహరహమ్ము నచట రాధ!

పరిమళోదార మృదుమనోహర సమీర
దరతరంగాభి చలిత లతావితాన
లలిత యమునానదీతీర కవితవనుల
చెలియ! వనమాలి సతము వసించుచుండె.

అమరదుర్లభ మధుమూర్తి వైన నిన్ను
వల్లవీకాంత విరహతాపమ్మువలన
నెదుటభావించి, విలపించు, బెదరిచూచు
బయలు కౌగిటజేర్చు విహ్వాలతనూర్చు
నోయి! వనమాలి! వేగవిచ్చేయుమోయి!

స్థానాపతి రుక్మిణమ్మ.

# చర్చ



శ్రీమతి
భావరాజు
రాజ్యరత్నమ్మ



నందిగ్రామము చేరినపిమ్మట అనితాతో నాకు పరిచయమేర్పడెను. నావద్ద ఆమె సంస్కృతము నేర్చుకొనుచుండెను. ఒకనాడామె నాతో నిట్లనెను.—'నా ఆచరణ బహుశా మీకాశ్చర్యము కల్గ జేయుచున్నది కాబోలు.'

నేను:—ఏమీ ?

ఆమె:—హిందూ లలనలగూర్చి తమవంటివా రూహించు విధముగా నేను నడచుటలేదుగా.

నేను:—ఇదేమంత ఆశ్చర్యకరమైనది కాదే, ఉన్నత విద్యాభిమానులగు నేటి స్త్రీలందరునూ హైందవ స్త్రీల ప్రాచీన సంస్కారములను విడనాడుచునేయున్నారు.

ఆమె:—ఔను, మమ్ములను మూర్ఖులనుగా నెంచు సంఘము యొక్క సంస్కారములను మేము తప్పక విడనాడుదుము. కాని పురుషుల అత్యాచారములను మారుమాటలేక సహించు స్త్రీలే ఆదర్శప్రాయులని తమరి ఊహయై యుండునేమోనని తోచుచున్నది.

నేను:—కాదు నాఊహ యదికాదు. నేను హిందూసంఘముయొక్క దోషములను స్వీకరించెదను. కాని ఆధునిక విద్యాప్రభావమువలన స్త్రీలు తమ స్వాభావికగుణములను త్యజించుచున్నారు. విద్య కేవలము కుసంస్కారములనుండి దూరముచేయుటయేకాక, ప్రకృతియొక్క సరళమైనటువంటిన్ని విశాలమైనటువంటిన్ని మార్గమునుండి తొలగించి సభ్యత్వమనెడి కృత్రిమ, సంకీర్ణమార్గమున త్రోయుచున్నదనునది నిజము. తాము స్త్రీ స్వభావమునకు విరుద్ధముగా నడచుచున్నారని తమరు తలచుటలేదా? స్త్రీల నవమానించిన ఫలితము హిందూసంఘము పొందుచునేయున్నది. తమరేల తమ స్వభావమును మరువవలయు?

ఆమె:—వివాదములో, తమవంటివారివద్దనుండు నిరుపయోగముకాని శస్త్రమిది యొక్కటియే. సాధనతాస్వావలంబన భావములు మా స్వభావమునకు విరుద్ధములా ఏమి?

నేను:—వాని ఆవశ్యకతయే స్త్రీలకు లేదు. స్త్రీలలోనె, స్నేహము, దయ, కరుణ, మరియూ సహనశీలత మూర్తీభవించియుండ చూడవలయును.

ఆమె:—స్నేహము, సహనశీలత, ఇవియే స్త్రీల దుర్బలత్వమునకు కారణములు.

నేను:—పురుషులయందుననూ, ప్రేమ, త్యాగములు కలవు.

ఆమె:—వారిలో ప్రేమ ఉగ్రవాసనారూపమున నున్నది. కావుననే సందేహము, ప్రతిహింసయూ ప్రకటములగుచున్నవి. అట్టి ప్రేమయందున త్యాగములేదు. అచ్చట పురుషుడు తన యాజమాన్యతాధికారమును విడువజాలడు. ప్రేమికయైననూ స్త్రీ బానిసయే యగుచున్నది. బంకిమ్‌బాబు నవలలోని రోహిణివలె నామెను పురుషుడు తన ఇచ్ఛానుసారము, హృదయమునందు స్థానము నీయవచ్చును, ఈయక పోవచ్చును. ఇట్టి ప్రేమపైన స్త్రీకి యధికారములేదు. భిక్షారూపముననే యామెకది ప్రాప్తించుచున్నది.

నేను:—ఈమాట మీదికాదు. ఆధునిక నవలాలేఖకులది. నవలలవలననే తమరు దీనిని గ్రహించిరి.

ఆమె:—అవశ్యము, స్త్రీ పురుషుల పరస్పరసంబంధమునుగూర్చిన ప్రశ్నయే నేడన్నిటికన్ననూ ముఖ్యమైయున్నది. ఉన్నత దేశసాహిత్యము లన్నిటిలోననూ దీనినిగూర్చి చర్చించు నవలలు కొన్నిగలవు. సంఘమువలన మన హృదయమున కాఘాతము తగులునప్పుడు, ప్రతిక్రియారూపమున తిరిగీ దాని కాఘాతము గల్గింప, పురాతన సంస్కారములనుగూర్చి బాగుగా నర్థముజేసుకొనగోరు సమయమున, ఈ ద్వంద్వమును తీసుకొని సమస్యామూలకములగు నవలలు రచింపబడుచున్నవి.

నేను:—సమాజముయొక్క ముఖ్యప్రశ్న స్త్రీ పురుషుల సంబంధము—దాంపత్యప్రేమయై యున్నది. ఇదియే సంఘపు పునాది. దీనిరక్షణకై హిందూసమాజమొక హద్దు నేర్పరచినది. కాని అనేక కారణములచేత నా హద్దు తెగిపోవుచున్నది. కొన్నాళ్లక్రిత మొకానొక మాసపత్రికలో ప్రేమచంద్ గారి కథ నొకదానిని జూచితిని. అందీవిధముగా నుండెను. ఒకానొక హిందూ దంపతు లన్యోన్యమైత్రితో మెలగుచుండిరి. ఇట్లుండ ఒక ముసల్మానుని దుర్దృష్టి ఆమెపైబడెను. ఒక నీచుని సాహాయ్యమున వా డా దంపతులలో వైమనస్యము గల్పించెను. అంతమున నా హైందవ స్త్రీ ముసల్మానుని గృహము జేరెను. మీ రేమనెదరు? ఆమె పతనమునకు గారణము ఆమె మానసికప్రవృత్తియే యైయున్నది. సామాజికదోషము కాదుగా?

ఆమె:—ఈమాట సేవాసదన్ లోని సుమన్ విషయమై యనజెల్లదు. అచ్చట సామాజికదోషమే యైయున్నది. ఆమె కహంభావము మెండు. ఇతరుల యాధిక్యత సహింపజాలకుండెడిది. అట్టిచో (1) దేవ స్థానములయందు సహితము వేశ్యల యాదరణ. (2) సందేహముచే భర్త యామె నింటినుండి వెడలగొట్టుటకు గారణము; వ్యభిచారమునం దసూయచేగాదు. అట్లయిన, వేశ్యను సన్మానించుట జరుగకుండెడిది. యూరప్‌నందుననూ ప్రస్తుతమిదియే సమస్యగా నున్నది. దీనినే నవలారచయితలు వ్యక్తము గావింపదలచుచున్నారు. సాంఘిక సదాచారముల పరీక్షింపగోరుచున్నారు. కావుననే నేడు మన జీవితసత్యము నావరించుకొని, పుష్పరేకలవలె వికసించియున్న సంస్కారములను త్రెంచివైచి ఉజ్వలసత్యమును గ్రహించు శక్తియొక్క పరీక్ష జరుగుచున్నది.

నేను:—ఈ పరీక్ష నగరములయందే వ్యాపించియుండుగాక. పల్లెలలో శాంతి, సౌందర్యము లున్నవి.

ఆమె:—విచిత్రమైన కల్పనాప్రకాశమునందు ప్రపంచమును పరికించుచుండువారికి, ప్రపంచముయొక్క వర్ణవైచిత్ర్యములలో నానందమవశ్యము గల్గును. కాని వాస్తవిక జగత్తుతో పరిచయము వారికి గల్గుటలేదు. గ్రామములయొక్క సస్యశ్యామలమైన పొలములు, సరళస్వభావులును, శాంతులునైన గ్రామీణులును, మన సాహిత్యమునందు చిరస్థాయియైన ఆసనమును పొందిరి; కాని ఈ కల్పనాచిత్రముతో పోల్చి జూచిన గ్రామముయొక్క స్థితి యెంత విషమముగా నున్నదో, జూచినవారే సులభముగా దెలుసుకొనగలరు. గ్రామవాసుల సరళజీవనముయొక్క సౌందర్యము, మన హృదయములలో నానంద మవశ్యము గల్గజేయును;

కాని గ్రామసమాజముయొక్క యథార్థస్వరూపమును జూచినయెడల వేదనయే గల్గును. గ్రామముయొక్క యథార్థదృశ్యము ప్రేమచంద్ గారి సంగ్రామమను నాటకమున గలదు.

నేను:—కాని హిందూధర్మమునందు, సర్వత్ర తపస్య, ఆత్మత్యాగముయొక్క ఆదర్శము నిండి యున్నదని తమరు స్వీకరింతురుకదా? నేటివఱకీ యాదర్శము హిందూ లలనలద్వారా సురక్షితముగా నున్నది. హైందవ గృహములలోని దాంపత్యప్రేమ నేటివఱకా తపస్యయొక్క సామగ్రియైయున్నది. తమరు దీనిని నష్టముజేయ గోరుచున్నారా? ఏమి?

ఆమె:—మన జీవనములో, దాంపత్యప్రేమ, తపస్యయొక్క సామగ్రియని మీరెంత గర్వముతో నుడువుచున్నారు? స్త్రీలవలన ఈ దాంపత్య ప్రేమయొక్క పవిత్రత రక్షింపబడుచున్ననూ, పురుషులవలన ఈ సంబంధమెంత పవిత్రముగా నిర్వహింపబడుచున్నదో, వచించుట మీకు కష్టమేయగుగాక, కాని తమకు తెలిసిన విషయమే భావావేశములో నిండియుండుటవలన పార్థివవస్తువులను దెలిసికొనుట కష్టము. సమాజము యొక్క నిమ్న శ్రేణిలో విధవావివాహములు ప్రచలితములైయున్నవి. మనదేశపు విపత్నీకులగు పురుషులు సమాజశాసకుల దృష్టిలో యలంకారశాస్త్ర కవులవలె నిరంకుశులు. ఇరువది, ముప్పదియేండ్లు, తనతోగలసి జీవితము గడపిన భార్య గతించినచో, రెండుమూడు నెలలకే తిరిగీ ద్వితీయవివాహ మొనరించుకొని యామె స్మృతిని యనంతాకాశమున విలీనము గావించుచున్నవారి పని యెంత గర్హితమైనదో మనమింకనూ గ్రహించుటలేదు. విపత్నీకులేకాదు, సపత్నీకులు సహితము నడిమివయస్సులో ద్వితీయవివాహ మొనరించు కొనుచున్నారు. ఇట్టి ఘటనలు మన సంఘములో సాధారణముగా జరుగుచున్నవి. స్త్రీ పురుషులలో దాంపత్యప్రేమ పూర్ణ రూపమున నాటుకొనియున్నచో ఇట్టివి జరుగనేరవు. కేవలము స్త్రీయొక్క యపరిమితానురాగమును మాత్రమే దాంపత్య ప్రేమయన జెల్లదు. స్త్రీ పురుషుల పరస్పర స్వాభావికాను రాగమునే దాంపత్య ప్రేమయన జెల్లును.

నేను:—స్త్రీలకు పాశ్చాత్యవిద్య నొసగినందువలన గల్గిన కుపరిణామ మిదియే. లేనియెడల సంఘమునందిట్టి తలంపులకు తావెట్లుండును?

ఆమె:—తమవంటివారు శృంఖలా విచ్ఛిన్నములని తలంచునట్టి ఆలోచనలు కొన్ని 'ప్రస్తుతము' హిందూ సంఘములో వ్యాపించుచున్నవనుమాట నిజమే; కాని ఈ ఊహా ప్రవాహమును, పాశ్చాత్య విద్య వలని కుపరిణామమనుటవలన ప్రయోజనములేదు. సాహిత్యమునందును, సంఘమందునను, స్వతంత్రభావ ములు జేరియుండుట యుగ ధర్మముయొక్క ఫలితమైయున్నది.

నేను:—యుగ ధర్మమా!

ఆమె:—ఔను యుగ ధర్మమే! యుగధర్మ ప్రవాహమును తప్పించుకొని తిరుగగల్గిన దేశ మెద్దియూలేదు. పూర్వ మొక దేశముతో నింకొక దేశమునకును, ఒకజాతితో నింకొక జాతికిని, మైత్రి ప్రస్తుతమంత సరళముగాను, గంభీరముగాను గల్గజాలకుండెడిది. ఆ సమయమున భిన్నభిన్న దేశములలో భిన్నభిన్నములైన యుగ ధర్మములు ప్రకటములగుచుండెడివి. ఫ్రాంసు రాజ్యక్రాంతి సమయమున ఐరోపీయ సాహిత్యమునందు జొచ్చిన భావప్రవాహము, మన తత్కాలీన సంఘమునందుగాని, తత్కాలీన సాహిత్యము

నందుగాని తన ప్రభావమేమైన జొప్పింపగల్గెనా? కాని ప్రస్తుత మే సభ్యదేశమునందైన నట్టి ఘటనలు సంభవించుచో, దాని ప్రభావము మనపైకి రాకుండానుండుటసంభవము. సభ్యత్వము విస్తరించు కొలదిని సమస్తదేశములలోను ఆదాన ప్రదానములు జరుగుచున్నవి. కాళిదాసుని సమయమున నాతని ఉత్తమ రచనలయిన రఘువంశము, కుమార సంభవము, శకుంతల మొదలయినవన్నియూ కేవల భారతదేశ సంపదలై యుండెను. కాని ప్రస్తుత యుగమునందలి శ్రేష్ఠకవులెవ్వరును, యొకదేశపు ప్రత్యేకకవులు మాత్రమే కాదు. వారు సమస్త దేశములయొక్కయూ, సమస్త జాతులయొక్కయూ కవులైయున్నారు. ఈ విధముగా ప్రపంచమంతయూ నొక విశాలమైన కుటుంబము, లేక గృహరూపమున మార్పు జెందుచున్నది. కావుననే పాశ్చాత్య ప్రాచ్య దేశములలో భావము లేకములగుచున్నవి. ఇదంతయూ యుగ ధర్మముయొక్క ఫలితమే!

నేను:—యుగ ధర్మముయొక్క ఫలిత మిదియేయైయున్నచో కోరదగినదిగా లేదు. నాకిది క్షణికమైన యుత్తేజనవలె గాన్పించుచున్నది. నిర్వాణోన్ముఖమైన దీపశిఖవలె నిది యంతరించును.

ఆమె:—సంఘమొక బలిష్టమగుశక్తి. శక్తియున్నచోటనే కదలికయున్నది. యుగము వెంబడి యుగము గతించుచున్నది. మానవుడుకూడా ఊహా పరివర్తనతోబాటు వివిధములైన మార్గముల ననుసరించుచూ తనను ప్రకాశింపజేసుకొనుచున్నాడు. నేడు దేశములో వ్యాపించు ప్రకాశమును, నిర్వాణోన్ముఖమైన జ్యోతిశిఖయొక్క భ్రమయనుటకు గారణమేమియూ లేదు.

నేను:—నేడు భారతవాసులు స్వాధీనతకొఱకత్యాతురులైయున్నారు. స్త్రీ విద్య, విధవావివాహము, అసవర్ణవివాహము మొదలగువాని ప్రచార ప్రయత్నములు నేడే దేశములో సంభవములగుచున్నవి. వర్తమానయుగము ననుసరించి మనజాతిని లేక సంఘమును నడిపింపనిచో మన రక్షణ కష్టమని నేడు మనము గ్రహించితిమి. కావుననే నేడు మనలో, ప్రాచీన సంస్కారములను, జ్ఞాన, విచారణ లనెడి ఒరగల్లుపై పరీక్షింప నిచ్చపొడమినది. అయినను తమ యాదర్శమేమి?

ఆమె:—అన్ని విధములైన స్వాధీనతలను పొందుటే ఈ యుగాదర్శము; కర్మ స్వాధీనత, మరియూ భావ స్వాధీనత. ప్రాచీనాదర్శములచే మా జీవనములు నిరుపయోగములుగా స్థిరపడుచో, వానిని వదలివేయుటలో మాకేమాత్ర మభ్యంతరమును గలుగజాలదు. ప్రకృతియొక్క భగ్నావశేషమువలన నొక నూతన సృష్టియగుట కెంతమాత్రమును, సందేహములేదు. పరంపరాగతమైన భావ ప్రవాహము, ఏవం యుక్తిహీనములైన సంస్కారముల ఆవశ్యకత మాకులేదు. మాకు గావలసినది స్వతంత్రము, సరళమునగు నుదారహృదయము. స్త్రీ పురుషుల దాంపత్య సంబంధముయొక్క పరీక్షకై మా హృదయములలో మేల్కొనిన భావ ప్రవాహమువలన భయపడవలసిన పనేమియూ లేదు. తమ యతఃపురములో విప్లవము జరుగునని తాము తలచకుందురుగాత' యిట్లని యామె నవ్వెను. నేనుకూడా నవ్వి యంతటితో నా వివాదము నంత మొందించితిని.

# మాతృభూమి

గీ. ఖండ ఖండాంతరంబుల ఖ్యాతిఁబొంది
పంచ మహాపతివ్రతలని యెంచబడిన
ద్రౌపదేత్యాది సతీ తారలను గన్న
భారతావనిగదా! బహు భాగ్యశాలి.

గీ. సాటిలేనట్టి సారంపు మాటలనుచు
ఖండ ఖండంబులం జెంద నఖండయశము
వేదశాస్త్ర పురాణము లాదిగన్న
భారతావనిగదా! బహు భాగ్యశాలి.

గీ. ప్రాణికోటుల పాపంబు బాపునట్టి
కాశికేదారాది క్షేత్రముల్ గలిగియుండి
ఖండ ఖండంబులంగన్న గానరాని
భారతావనిగదా! బహు భాగ్యశాలి.

గీ. జీవరాసుల కెల్లను చేవగూర్చు
శాలిపైరుల కెల్ల సకాలమందు
గంగ గౌతముల్ నీరిచ్చి పొంగి పార
భారతావనిగదా! బహు భాగ్యశాలి.

గీ. కృష్ణరాయ వరరాజ కేసరముల
ఖడ్గతిక్కన యోధాది గన్నతల్లి
వీర శౌర్యంబులకు గడు పేరుపడ్డ
భారతావనిగదా! బహు భాగ్యశాలి.

చిత్రపూరి కృష్ణవేణి.

# రెండు వరాలు

— సమయమంత్రి రాజ్యలక్ష్మి —

అబలలు అవసరమైనప్పుడే అకా
రాన్ని అవతల వుంచుతారు
కాని వారెప్పుడూ అబలలే.

'ఇందాక అలా కిటికీలోనుంచి వీధిలోకిచూస్తూ నిలబడిపోయావుట ఎందుకు?' అన్నాడు కేశవరావు, అప్పుడే టెన్నిస్‌నుంచి వచ్చి స్నానంచేసి పట్టుపంచ కట్టుకుంటూ.

'మీరింటిదగ్గర లేరుగదా. మీకెలా తెలిసింది నే వీధిలోనికి చూశానని? ఎవరు చెప్పారు?' అన్నది సుశీల, సహజమైన తన సన్నగొంతుకతో.

'ఎవరా? ప్రశ్నకు పైప్రశ్న వేస్తావేం? దుర్మార్గపుపనులు చేస్తుంటే ఎవరేనా చెప్పుతారు. మా చెల్లాయి మణి చెప్పింది.' అన్నాడు కోపంతో.

'మీ చెల్లాయి చూస్తే తప్పులేదా?' అంది సుశీల, కొంచం పెంకితనంగా.

'దాని జోలి నీకెందుకు? నీవిషయం సమాధానం చెప్పు' అన్నాడు కసరినట్టుగా.

'సాయంకాలం మీరు వెళ్లాక మణీ, నేనూ గదిలో కూర్చున్నాం. ఇంతట్లోకే వీధిలోకి 'అమర జ్యోతి' సినీమా బండి వచ్చింది. ఇద్దరమూ చూశాం కిటికీదగ్గర నిలబడి. ఇందులో నాది తప్పయి, ఆవిడది ఒప్పు ఎందుకైయ్యిందో నాకు తెలియదు' అంది.

'అబ్బాయీ! వడ్డించా! రా! నాయనా! ఎంతచెప్పినా దానిబుద్ధి అంతే బాబూ? ఇంతకూ నీ కర్మం. చదువుకుంటూన్న పిల్ల వద్దని నే మొదటే చెప్పాను. రా! అన్నం చల్లారిపోతూంది,' అని పిలిచింది తల్లి సుబ్బమ్మ.

'ఇటువంటి పాడుపను లెప్పుడేనా చెయ్యి చెప్తా.' అంటూ ఒక్క తోపుతోసి భోజనానికి వెళ్లాడు కేశవరావు.

కండ్ల నీరు కారుకుంటూ తమలపాకులు మడుస్తూంది సుశీల. కాపరానికి వచ్చినది మొదలిదే వరస. సుశీల తల్లిదండ్రుల కిద్దరాడవాళ్లు మాత్రమే. సుశీల కడగొట్టుది. పెద్దామెకు బాల్యవివాహం, ఆరునెలలు తిరక్కుండా బాల్యవైధవ్యం సంభవించాయి. ఆమెకష్టాన్ని మనస్సులోపెట్టుకుని సుశీలని పదిహేను

సంవత్సరాలు వచ్చేవరకూ ఆరవఫారంవరకూ చదివించినతర్వాత బి. యె. చదువుతున్న కేశవరావుకిచ్చి మహావైభవంతో వివాహంచేశాడు, రెండువేలరూపాయలు కట్నంతో, సుశీల తండ్రి సుబ్బారావుగారు. సుశీల కాపరానికివచ్చి రెండుసంవత్సరాలైంది. అప్పటినుంచీ, మామగారి ఆస్తికి తానే హక్కుదారుడననీ, ఇప్పుడే తనపరం చేయవలెననీ, పెంకెతనంచేత సుశీలని పుట్టింటికి పంపడంలేదు, కేశవరావు. B. A. ప్యాసు అయ్యి రెండేండ్లయినా 'డిప్రెషను' మూలాన్ని వుద్యోగమేమీలేదు కేశవరావుకి, భార్యని బాధించడం తప్ప. రెండుపూటలా క్లబ్బుకు పోవడం, టెన్నిసు ఆడడం, సిగరెట్టు పీల్చడం బాగా అలవాటయాయి. కాని ఎంతచదువుకున్నా కేశవరావుకి స్త్రీ స్వాతంత్ర్యం కిట్టదు. భార్యమీద అనుమానమూ, భార్య అంటే దాసీ అనే భావమూ, సుశీలని చాలా బాధిస్తున్నాయి.

సుశీల చాలా చురుకూ, తెలివీ గలది. స్వతంత్రపు టూహాలలో పెరిగింది. సంస్కరణప్రియురాలు. కేశవుని మనసారా ప్రేమించింది కాని అతని పూర్వాచార పరాయణతనీ, అతనికి స్త్రీలయందుండే నీచ భావాన్నీ, కుంచితహృదయాన్నీ చూచి అసహ్యించుకునేది. విచారించేది. 'ఎలాగైనా, ఎప్పటికైనా, తన జీవితమంతా ధారపోసి అయినా, తనభర్తకు హిందూసంఘాలలో వుండే పాడు ఆచారాలూ దౌర్జన్యమూ కనబరచి, ఆ భావాన్ని మార్చలేకపోతానా? అట్టి సుదినం తన జన్మలో రాదా?' అని రోజులు గడుపుతూంది. అతనియందుండే పవిత్రప్రేమవల్లనే అతనుపెట్టే బాధలను సహిస్తుంది.

౨

అది వేసవికాలం. రాత్రి భోజనం అయి సిగరెట్టు పీలుస్తూ గది దొడ్లో మల్లెపందిరిదగ్గర ఈజీ చైర్లో కూర్చున్నాడు కేశవరావు. మల్లెపందిరిలోనుంచి వెన్నెల బొట్లులా పడుతూంది కేశవుడుమీద. తమకున్న సౌరభాన్నంతా ఒక్కసారిగా వెదచల్లుతూన్నట్లు పరిమళిస్తున్నాయి అరవిచ్చిన మల్లెపూలు. వంటయింటి పనులన్నీ చక్కపెట్టుకుని మడిచీరవిడిచి, మడతచీర కట్టుకుని వచ్చింది సుశీల.

'సుశీలా! యిలా కూర్చో. ఏమేనా విశేషాలు చెప్పు' అన్నాడు కేశవుడు. యిటువంటి సంతోషసమయాలు చాలా అరుదు సుశీలకి.

'విశేషాలేమీలేవు గాని, ఎన్నాళ్ళనుంచో ఒకవిషయం అడుగుదామని అశ్రద్ధచేస్తున్నాను. ఇది సమయమా?' అంది సుశీల, ప్రక్కనే కర్జూరం ఆకుల చాపపరచి కూర్చుంటూ.

'ఏం! మా అమ్మ సాధిస్తూందని వేరుండాలనా? లేకపోతే నీకు తగినవాడను కాదని పుట్టింటికి ప్రయాణమా? ఏది నీ కోర్కె?' అన్నాడు కేశవరావు.

'నేనిలా అడుగగానే మీరలా యెందుకు భావించుకోవాలి? మీ అమ్మగారు సాధిస్తున్నారని నేనెప్పుడేనా అన్నానా? పెద్దవాళ్ల అదుపాజ్ఞలు లేకపోతే ఈకాలపు సీతాకోకల్లాంటి యువతులు అదుపాజ్ఞలలో వుంటారా? మీరాదరించడం లేదని ఎప్పుడేనా విసుక్కున్నానా? తమరలిగి అమ్మగారింటికి పంపకపోతే, పంపమని అడిగానా? ఏది యెలా జరిగినా 'మన అదృష్టం' అని భావించుకుంటూంటే ఒక విధమైన తృప్తి కల్గుతుంది మనస్సుకి. మన ఆర్యులు 'కర్మ' సూత్రాన్ని కేవలం మన ఆంధ్రులకు, ముఖ్యంగా ఆంధ్రస్త్రీలకూ సృజించారనుకుంటూ.'

'సుశీలా! నీతో నే వాదించలేను. అసలు నీసంగతి ఏమో చెప్పు' అన్నాడు కేశవుడు.

'మన సంఘం విషయంలో నాకు తెలిసినంతవరకూ వ్యాసాలు వ్రాదామని కుతూహలం. మన వివాహానికి పూర్వం ఏమేనా వ్రాసేదాన్ని. యిప్పుడు తమరిష్టపడాలిగాదూ మరి!'

'ఇప్పుడుమాత్రం నేను యిష్టపడక, నీవు మహాకష్టపడుతున్నావు కాబోలు. అయినా సంఘంలో నీవు దిద్దాలిసిన తప్పులేమున్నాయి?' అన్నాడు వేళాకోళంగా.

'మీరు ప్రతీదానికీ నన్ను వేళాకోళంచేస్తే ఎలాగ? ఎన్నో మంచివి, ఎన్నో చెడ్డవి ఆచారాలు వుండవచ్చును. నాకు తెలిసినవి స్వల్పం. ఇక నేను సమర్థించగలిగేవి లెక్కకేవుంటాయి' అంది సుశీల కేశవుని దీర్ఘసంభాషణ కాశ్చర్యపడుతూ.

'అవేవో చెప్పు చూదాం!'

'మొదటిది 'స్త్రీ స్వాతంత్ర్యం' గురించి.'

'స్త్రీకి స్వాతంత్ర్యంలేక జైల్లో పెట్టారా?'

''జైలు' అంటే వ్యక్తిస్వాతంత్ర్యం నశించిందన్నమాట. ఖైదీ ఎక్కడకు వెళ్లేందుకూ వీలులేదు. కాలకృత్యాలు తీర్చుకోవడానికి పోయేప్పుడుకూడా ఒకరు కాపలావుంటారు. స్త్రీకీ అంతే. ఆమె ఎక్కడకు వెళ్లేందుకు వీల్లేదు. మగవారి అనుజ్ఞ కావాలి. కాకుండా ఎవరో సాయముండాలి. నిజంగా స్త్రీకి వ్యక్తిస్వాతంత్ర్యం వుందో, లేదో, నిష్పక్షపాతంగా మీరే ఆలోచించి చెప్పండి చూదాం.'

'సుశీ! నీతో వాదించడం కష్టం కాని, మన పూర్వుల ఆచారాలు మనం ఆచరిస్తున్నాం. ఇందులో మన తప్పేమున్నది?'

'నిజమే! కాని, యెన్నాళ్లు 'గానుగయెద్దు' మాదిరిగా వుండడం? అప్పటి స్త్రీలకు పారమార్థిక వాంఛ యెక్కువగా వుండడంవల్లా, అప్పటి పురుషులకు స్త్రీ అంటే యింత నిరసనభావంలేక పూజ్యభావం వుండడంవల్లా, మనవారు ధర్మశాస్త్రాలు సృజించేటప్పటికి దేశం స్వాతంత్ర్యంగా వుండడంవల్లా వారికీ హక్కులతో నిమిత్తం లేకపోయింది. వారు కోరలేదు. క్రమంగా, పురుషులు అడుగునత్రొక్కారు స్త్రీ స్వాతంత్ర్యాన్ని. మనకు భగవంతుడు దయాపూరితమైన మనస్సూ, తెలివిగల మెదడూ యిచ్చినప్పుడు ఎందుకు వుపయోగించుకోకూడదూ?'

'యిప్పటి స్త్రీలుమాత్రం పారమార్థికచింత యెందుకు వుంచుకోకూడదూ? వీరుచేసే పనులు యిప్పుడుమాత్రం ఏమి మిగిలిపోయాయి?'

'అదికాదు! యిప్పటి దేశకాలపరిస్థితులనుబట్టి స్త్రీ చేయవలసిన పనులలో, స్త్రీ స్వాతంత్ర్యం ముఖ్యావసరం. స్త్రీలు పరదాలుదాటి బయటికివస్తేనే గాని స్వరాజ్యం, స్వాతంత్ర్యం రాదు. ఈ దేశంలో పురుషులకుమాత్రం వున్నదా పూర్తిగా వ్యక్తిస్వాతంత్ర్యం? స్త్రీలను పరదాలలోనుంచి పైకి రానిస్తే దేశానికే మోక్షం కలుగవచ్చు.'

'అబ్బా! ఎంతవరకూ వచ్చావు సుశీలా! ఇన్ని ఆశయాలు నీ హృదయంలో కప్పిపుచ్చి ఎలా యిలాటికాపురం చేస్తున్నావో నాకు చాలా ఆశ్చర్యంగా వుంది' అన్నాడు చెక్కిలి నిమురుతూ.

'అదే భారతస్త్రీకి గల ఉత్తమోత్తమ శుభలక్షణం. ఒకవేళ స్త్రీలకు సమానహక్కులిచ్చినప్పటికీ భరతమాత పుత్రికలంత మూఢురాండ్రు కానేరరు. అబలలు అవసరమైనప్పుడే ఆకారాన్ని అవతల వుంచుతారు కాని వారెప్పుడూ అబలలే.'

నిదానించి చూస్తూ 'సుశీలా! నీ బుగ్గలలా పాలిపోయినాయేమి?' అన్నాడు ప్రేమపూర్వకంగా.

'ఉండండి! పిల్లి పాలుమీద మూత పడద్రోసినట్టుంది' అంటూ వెళ్ళిపోయింది సిగ్గుపడుతూ.

కేశవు డాశ్చర్యపడుతూ కూర్చుండిపోయాడు సిగరెట్టు పూర్తిచేసి.

3

'నేను మళ్ళా యిరవైఒకటోరోజున పంపుతానండీ, అంత అదృష్టవంతులమైతే. అక్కగారూ! నామాట వినండి. మళ్ళా వర్జం వస్తుంది పంపండీ' అంటూ బ్రతిమాలారు సుబ్బారావుగారు కూతురుకు నూడిదయిచ్చి. 'ఏమోనమ్మా నాకెందుకూ. నా పెత్తనమేమున్నా పెంకులవుతూందా? అడగండి. మీ అల్లుడి యిష్టం. మీ అమ్మాయి యిష్టం. నాకెందుకూ రవ్వా రొష్టూనూ' అని సాగదీసుకుంటూ యెలాగైతేనేం, సుశీలని పురిటికి పంపనీయలేదు అత్తగారు సుబ్బమ్మ.

సుశీలా కేశవులలో కాలం మారింది. ఆ పాలిపోయిన బుగ్గలూ, కండ్లలోని నీరసమూ, కాస్సేపు పనిచేసేటప్పటికే శ్రమను తెలిపే ముఖంమీది ముత్యాల్లాంటి చెమటబిందువులూ, నడుములోని ఆధిక్యతా, గమనంలోని మందమూ, కేశవునిలో ప్రేమను రేకెత్తించాయి. కాని చాలా బలహీనంగా వుంది సుశీల. మందు యిప్పించేవారుగాని, పుచ్చుకోమనేవారుగాని లేరాయింటిలో. అప్పుడప్పుడు కేశవుడనుకునేవాడు గాని డబ్బూ, స్వాతంత్ర్యంకూడా లేదు తనకి. ఒకమారు తల్లితో ప్రస్తావించాడీ విషయం. వెంటనే సుబ్బమ్మగారు నూరేకారంలా అయిపోయింది.

సుశీలకు పురిటిసమయం సమీపించింది. రెండురోజులనుంచి ప్రసవవేదనపడుతోంది. పురుడువచ్చే సూచనలేమీ లేవు. పురిటికి, పుట్టింటికి తానైనా స్వతంత్రించి, పంపనందుకు పశ్చాత్తాపపడుతూ మామగారికి కబురంపాడు కేశవరావు, తమ్ముని ప్రోత్సాహంతో. వెంటనే బయలుదేరి వచ్చారు సుబ్బారావుగారు కంగారుపడుతూ. రావడంతోనే సుశీల అవస్థచూచి తక్షణం డాక్టరుకోసం దగ్గరవున్న టౌనుకు వెళ్ళారు.

కాని సుశీల పరిస్థితి ఏమీ బాగాలేదు. తన స్థితిగతులు గమనించి కేశవుడికి వర్తమానంచేసింది. వచ్చాడు కేశవుడు కళ్లనీళ్లు గ్రక్కుకుంటూ భార్యదగ్గరకి. 'సుశీలా! ఏమిటి సమాచారం?' అన్నాడు గద్గదంగా. 'సమాచారం ఏమీలేదు. నాకు చాలా నీరసంగావుంది. నాకిక భగవంతుని సెలవయింది మీదగ్గర సెలవుపుచ్చుకునేందుకు.'

'సుశీలా! భయంలేదు. మీ నాన్నగారు వచ్చారు. డాక్టరుగారికోసం వెళ్లారు. వచ్చేస్తూ వుంటారు. భయపడకు సుశీలా! నా నిర్లక్ష్యానికిప్పుడు చాలా విచారిస్తున్నా' అని వెక్కి వెక్కి ఏడ్చాడు కేశవుడు.

'ఇప్పుడేమీ లాభంలేదు. నేనిక బ్రతకను. మీదగ్గరనుంచి ఆనాడొక వరం పొందాను. ఈనాడు యింకో రెండువరాలు పొందాలని వుంది. అనుగ్రహిస్తే నిశ్చింతంగా ప్రాణం వదుల్తా'నంది నీరసంగా.

'తప్పకుండా, సుశీలా! నీవు బ్రతికినన్నాళ్లు నేనెన్ని బాధలుపెట్టాను సుశీలా. నాలాంటి కఠినుడికి నీవెలా దక్కుతావు. నా ప్రాణాన్నిచ్చేనాసరే నీ కోర్కెలుతీర్చి, నీ ఆత్మకి శాంతి చేకూరుస్తా' నన్నాడు ఏడుస్తూ. 'మనదేశంలో స్త్రీని భోగవస్తువులా చూడక, ఆమెయొక్క సున్నితహృదయాన్నీ, ఉదారపూరితాలైన ఆశయాల్నీ, వ్యక్తిత్వాన్నీ గమనించి ఆమెకు సమానహక్కులిచ్చి దేశాన్నీ, సంఘాన్నీ వుద్ధరించడం ముఖ్యావసరం. మీరు వివాహమాడే స్త్రీకి సమానహక్కులిచ్చి ఆదర్శకు లవడం మొదటికోర్కె. మీ వివాహం వితంతూద్వాహంగా వుండడం రెండవది. ఈ రెండూ ప్రసాదించి ఆచరిస్తే ఈ ఆత్మ సంతోషంతో వెళ్లిపోతుందీ శరీరంలోనుంచి' అంది. ఆయాసం పూర్తిగా హెచ్చింది.

'నేనిక వివాహం చేసికోను. కాని నా జన్మ అంతా నీ కోర్కెలను సఫలీకృతంచేయడానికే వినియోగిస్తానని భగవంతునిసాక్షిగా చెప్పుతున్నా. 'సుశీలా, నా సుశీలా! నన్ను వదలివెడుతున్నావా?' అంటూ పెద్దగా రోదిస్తున్నాడు కేశవరావు.

ఇంతలో బర్రుమని చప్పుడై కారు ఆగింది. ముచ్చెమటలతో సుబ్బారావుగారూ, డాక్టరుగారూ, నర్సూ దిగారు. కాని సుశీలమాత్రం ఈలోకంలో లేదు.

---

## అస్తమయము

పట్టుమబ్బురథాలఁ బయనించు తేజస్వి - బంగారమొలికించు ప్రభల ప్రభువు
బ్రదుకులోఁ బ్రాణసారమువోయు వైద్యుండు - పాపపుం జీఁకట్లఁ బాపుఱేఁడు
ప్రకృతినవ్వుల పంటఁబండించు కృషికుండు - పంచ్రండంశుమూర్తులఁ బరగువేల్పు
పరమాత్ము నాకృతిఁ బ్రకటించు ఫణిహారి - స్వర్గమర్త్యంబుల సంధికర్త

గీ॥ జగతివెలిగించు వేయివెలుఁగుల మగఁడు
త్రిగుణములకును నాధారమగు విభుండు
సకల కళ్యాణములఁ గూర్చు సత్త్వమయుఁడు
భాస్కరుం డస్తగిరి ప్రక్కఁ బవ్వళించె.

కొమరవోలు నిర్మలాదేవి.

# దుర్గామందిరము

(అసలురచయిత : ప్రేమచంద్)



హిందూసతి పవిత్ర హృదయంలో పతి సౌఖ్యమునకే అగ్రస్థానం. అట్టిదాన్ని అలంకారాలుగాని, మణిభూషలుగాని, కనకరాసులుగాని ఆకర్షించవు. భామ వేడికోలులో ఎంత ఉత్తమాశయం ఉందో!



ఏనిమిదిరోజులు పూర్తిఅయినాయి. ఆఖరురోజు వచ్చింది. ప్రభాతసమయము. భామ వ్రజనాథునిచేత మందుతాగించి పిల్లలిద్దర్ని వెంబడిబెట్టుకుని దుర్గపూజకి మందిరానికి బయలుదేరింది. ఆమె హృదయం ఆరాధ్యదేవిస్మరణతో నిండివుంది. మందిరంయొక్క ముంగిలిచేరింది. పూజారి ఆసనంమీద కూర్చొని దుర్గాస్తోత్రం పఠిస్తున్నాడు. అగరువత్తుల సువాసనలు చెలరేగుతున్నాయి. ఆమె మెల్లగా మందిరంలోకి ప్రవేశించింది. ఎదుట దుర్గ విశాల ప్రతిమ శోభాయమానంగా వెలిగిపోతుంది. ఆమె ముఖారవిందంలోనించి ఒక విలక్షణదీప్తి ప్రకాశిస్తుంది. నలువంకల పవిత్రత ప్రతిధ్వనిస్తోంది. భామ ఆ మూర్తిని మామూలు కళ్లతో చూడలేకపోయింది. ఆమె అంతఃకరణంలో ఒకవిధమయిన భయమావరించింది. మోకాళ్ల మీద కూర్చొని చేతులుజోడించి కరుణస్వరంతో వేడుకుంది—'తల్లీ నామీద దయుంచు.'

దేవి ఆమాటలికి చిరునవ్వు నవ్వినట్లు కనపడిందామెకి. ఆ దివ్యనేత్రాల్లోనించి ఒకజ్యోతిలా తనహృదయంలోకి వచ్చినట్లు తెలుసుకుంది. ఆమెచెవులకి దేవినోట్లోనించి యీ మాటలు వినబడినట్లయింది 'పరాయిధనం తిరిగియిచ్చివేయి; నీకు మేలుకలుగుతుంది.'

భామ లేచినిలబడింది. ఆమెకళ్లల్లో నిర్మలభక్తియొక్క అమాయకత్వం కనిపిస్తుంది. ముఖమండలంలో పవిత్రప్రేమ వర్షిస్తోంది. ఇంతలో ఇంకో స్త్రీ లోపలికి ప్రవేశించింది. ఆమెకేశాలు చిందరవందరగా చిమ్మబడినట్లు అటునిటు వ్రేలాడుతున్నాయి. కేవలం ఒక తెల్లటి చీరమాత్రం ధరించింది. చేతికిగాజులు తప్ప భూషణాలింకేమీ లేవు. ముఖంలో శోకవిచారాలు తాండవిస్తూన్నాయి. ఆమె గూడ మోకాళ్లమీద కూర్చొని నమస్కరించి దీనంగా వేడుకుంది—'దేవీ నాధనం యెవరు తీసుకున్నారో, వాళ్లని సర్వనాశనం చెయ్యి.'

భామహృదయం భయంతో కంపించసాగింది. ఈ మాటలు శరవేగంతోవచ్చి ఆమెగుండెల్లో గ్రుచ్చుకొన్నాయి. ఒకమారు దేవివంక చూసింది. ఆ జ్యోతిర్మయస్వరూపం భయంకరంగాఉంది. ఆ నేత్రాల్లోనుంచి భీషణజ్వాలలు వెలువడుతున్నాయి. భామ అంతఃకరణంలో ఆకాశంలోనుంచి, మందిర స్తంభాలనుంచి, మండుతున్న దీపంనుంచి, దేవి ముఖంలోనుంచి, అంతటినుండిగూడ యీ మాటలు వినబడుతున్నాయి 'పరాయిధనం యిచ్చివేయి, లేకుంటే నీ సర్వనాశనమవుతుంది.'

భామ నిలబడి ఆ వృద్ధురాలితో అంది 'ఎందుకు? నీ ధనం యెవరన్నా తీసుకున్నారా అమ్మా?'
మునిగిపోయేవానికి తృణమాధారం చిక్కినట్టు భామవంక చూసింది ఆ వృద్ధురాలు.

'అవును తల్లీ'

'ఎన్ని రోజులయింది?'

'ఒకటిన్నర మాసాలవుతుంది'.

'ఎన్ని రూపాయలు?'

'నూరుపైన యిరవయి యున్నాయి'.

'ఎలా పోయినయి?'

'ఏం తెలుసు? ఎక్కడో జారి పడిపోయినయి. నా భర్త పటాలంలో పనిచేశాడు. వారు చని పోయి చాల సంవత్సరాలయింది. సర్కారువారిప్పుడు నాకు ఆరవయి రూపాయలు పెన్షనిస్తున్నారు. అప్పుడు, రెండుసంవత్సరాల పెన్షను ఒక్కసారే దొరికింది. ఖజానాలో రూపాయలు తీసుకొని వస్తున్నా. ఎప్పుడు, ఎక్కడ పడిపోయింది తెలీదు'.

★ శ్రీమతి పోగుల శారదాదేవి ★

'మీకవి దొరికితే ఏమిస్తారు?'

'అందులో నలభయిరూపాయలు తీసియిస్తాను'

'రూపాయలు దేనికి? అంతకంటె మంచివస్తువేదైన యియ్యండి'

'తల్లీ, ఇంకేమియ్యగలను? బ్రతికున్నంతమటుకు నీకీర్తి పొగుడుకుంటా'

'వద్దు నాకది అవసరంలేదు'

'ఇదితప్ప నాదగ్గరింకేముంది? చెప్పు తల్లీ'.

'నాకు ఆశీర్వాదం ఇయ్యి. నాపతి జబ్బుగానున్నారు. నయమయ్యేటట్లు చెయ్యి'.

'వారికే రూపాయలు దొరికినాయా?'

వృద్ధురాలు వెనుకటిమాదిరిగానే కూర్చొని నమస్కరించి కంపితస్వరంతో వేడుకుంది—'దేవీ వారికి కళ్యాణం కలగజెయ్యి.'

భామ మళ్లీ ఒకసారి దేవివంక అశంకిత దృష్టితో చూసింది. ఆ దివ్యరూపంలో ప్రేమ ఉట్టి పడుతుంది. నేత్రాల్లోనుంచి దయ వెలువడుతుంది. ఈసారి భామ అంతఃకరణంలో ఎక్కడో స్వర్గ లోకంలోనుంచి యీ ధ్వని వినబడింది

'వెళ్లు. నీకు జయంకలుగుతుంది.'

# హృదయ సౌందర్యం

శ్రీమతి చుండూరి రమాదేవి

అది భయంకర కాళరాత్రి. విధివిరామంలేకుండా, ఏనుగు తొండాల్లాంటి ధారల్తో, వర్షం కురుస్తోంది. అల్లాంటి భీభత్ససమయంలో అన్నపూర్ణమ్మగారు యమబాధ పడిపోతోంది. ఆమె శల్యమాత్రావశిష్టయై, జీవిత సమాప్తి గంటల మీదున్నట్లుంది. ఆమెప్రక్కన సుమారు యిరవై సంవత్సరాల యువతి కూర్చుండి, మాటిమాటికి ఆ వృద్ధురాలిదెస దృష్టుల బరపుతోంది.

'ప్రభా ! అబ్బాయి రాలేదూ?'

'అత్తయ్యా, ఇంకా రాలేదు.'

'అమ్మాయీ ! నేనింక బ్రతకనే, అంతిమక్షణంలో వీడొక్కసారి నా కళ్ళబడితే బాగుండును. నా కీరాత్రి గడవదు. రా తల్లీ! ఇల్లారా, నాదగ్గిరకూచో. నీ విషయంలో వీడు చాలా అన్యాయం చేస్తున్నాడు. కానీ అమ్మా, నీకివి చీకటి రోజులు. ఇంక వెన్నెలరోజులు రాకపోవులే. నీకు శుభం ఆసన్నమైంది. నామాట నమ్మతల్లీ?'

'అత్తయ్యా ! ఇవన్నీ యెందుకు? ఏం భయంలేదు. ఈరాత్రి కొంచెం యెక్కువచేసింది. తెల్లారేటప్పటికి తగ్గిపోతుంది.'

'అయ్యో, పిచ్చితల్లీ! నీకు తెలియదమ్మా, తెల్లారేటప్పటికి, తనువే తెల్లారిపోతుంది. ఇంక కాసేపో కాసేపో! అబ్బా, ఆయాసం. నీవు అమాయకురాలవు. ఎల్లా దిద్దుకుంటావో యీ సంసారం! వాడు పట్టి దౌర్భాగ్యుడు కాకపోతే మాణిక్య మంటిపిల్లను యీ విధంగా పుసురుపెడతాడా? కట్టి కుడుపకపోదులే అమ్మా.'

'పోనీండి అత్తయ్యా, అల్లా అనకండి. వారినేమైనా అంటే, నా హృదయానికి నొప్పి కలుగుతుంది. అది నా అదృష్టం. వారేంచేస్తారు? ఏ విధానా వారికి తగను. ఆ సుందర ముఖసందర్శనం అనుదినమూ కలుగుతూంటే నాకదే చాలు.

'ప్రభా, రూపం కోరుతున్నాడుగాని, గుణం తెలుసుకోటంలేదు. యింత కష్టపెడుతున్నా నీకు వాడంటే యెంతప్రేమ ! బూటు చప్పుడౌతోంది. చూడమ్మా వచ్చాడేమో? అబ్బా! ఆయాసం. ఉక్కిరిబిక్కిరౌతోంది.

(చూచి) 'రాలేదు అత్తయ్యా. తల్లికన్న మిన్నగా చూచు మిమ్మల్నికూడా పోగొట్టుకొని ఎల్లా బతకను? ఈ సంసారభారం నేను మోయలేను. నేనుకూడా మీవెంట వస్తా. నన్నింక ఆదరించేవారెవరు?'

'తప్పు తల్లీ. వూరుకో. ఏడవకూడదు. ఇంకా ఎన్నాళ్లు బతకను? మనోవ్యాధికి మందులేదు. వాణ్ణి ఆఖరిసారి చూట్టానికి నాప్రాణం కొట్టుకొంటూంది. ఏంలాభం? వాడురాడు. మాతృహృదయం

తెలుసుకోలేని మూర్ఖుడు. అమ్మా, యీ సమయంలో కొడుకైనా నువ్వే, కోడలవైనా నువ్వే. నాకు ఆయాసం యెక్కువైపోతోంది. ఆ తులసితీర్థం గొంతుకలో పొయ్యి. అబ్బాయీ... నారాయణ... నారాయణ.

మోహనుడు శ్రీమంతుడు, సుందరుడు. అన్నపూర్ణమ్మ శివరామయ్యగార్ల ఏకైక పుత్రుడు. నూతన విలాస ప్రియుడు. నిత్యసంతోషి. పాశ్చాత్యనాగరికతానుసరణ అతనికి పరిపాటి. తన సహభాగినికూడ తన వలెనే నాగరికతావలంబియై తనకు ముదము గూర్పవలెనని కోరువాడు. ప్రభావతి పల్లెటూరి పిల్ల. కల్లకపటము లెరుగని అమాయకురాలు. సుగుణవతి. అత్తమామల ప్రాణము. భర్త హృదయమెరింగి మసలుకొను మగువ. సంస్కృతాంధ్రములలో చక్కని కృషి చేసినది. బంగారుబొమ్మ. మోహనునకు వివాహము బాల్యంలోనే జరిగింది. అతని తండ్రి శివరామయ్యగారు వ్యాధిగ్రస్తుడై యుండగా తన గారాబు పుత్రుని వివాహమైనా చూడదలచి కామదీక్షితులగారితో సంబంధము కలుపుకొన్నారు. అప్పటికి మోహనునికి 14 ఏండ్ల వయస్సు. ప్రభావతికి 8 సంవత్సరాలు. వివాహమైన ఆరుమాసాలకే శివరామయ్యగారు గతించారు. అన్నపూర్ణమ్మ గారు పుత్రుని చూచుకొనుచూ కొంత పతివియోగం మరువగలిగింది.

ఇంకో సంవత్సరానికి, ప్రభావతి మశూచికం పడింది; బతకదనుకొన్నారు. అన్నపూర్ణమ్మగారు కోడలు కులాసాగా బయటపడాలని వెయ్యిదేవుళ్ళకి మ్రొక్కింది. పీల్చి పిప్పినిచేసి అమ్మవారు బయట పడేసింది. కాని, రూపు మారిపోయింది. వామ నేత్రంలో పువ్వేసింది. మొహంనిండా గాట్లు. పూర్వపు ప్రభావతికీ, యీ ప్రభావతికీ పోలికలేదు. దైవనిర్ణయం. ఎవరేంచేస్తారు?

మోహనుడు పండక్కి అత్తవారింటికి వెళ్లాడు. భార్యను చూచి నిర్ఘాంతపోయాడు. నిరాశ చెందాడు. తాను నిర్మించుకొన్న వూహాసౌధాలు నేలకూలినవని తలచినాడు. తన భార్య తనకేవిధమున సరిరాదని నిశ్చయించింది అతని మనసు. ఆమెయందు విముఖత జనించింది. మరి అత్తవారిగుమ్మం తొక్కలేదు.

ప్రభ వ్యక్తురాలై 2 సంవత్సరాలైంది. మోహనుని అవస్థ పూర్తిగా మారిపోయింది. నిరంతర మిత్ర పరివృతుడు. అభ్యాసాలన్నీ పట్టుపడ్డాయి. స్నేహితులు చెప్పింది ప్రమాణం. రూపాయలు దమ్మిడీలగా వెచ్చించడ మారంభించాడు. సూటు, బూటు, హ్యాటు; దొరగారివలె తయారయ్యాడు. ప్రపంచజ్ఞానము నశించిపోయింది. చదువుకి స్వస్తి చెప్పాడు. స్వయంరాజా స్వయంమంత్రీ. అతనికేమిలోటు? వృద్ధమాత మాట పెడచెవిని పెట్టినాడు. ఆ మాతృహృదయం క్షోభిల్లిపోయింది. తన గారాబమే తనకు ముప్పైంది. కోడల్ని తీసుకువస్తే కొంత నడవడి బాగుపడుతుందని తోచింది. వియ్యాలవారింటికి వెళ్లి పిల్లను కడుపులో పెట్టుకు కాపాడతానని తీసుకొచ్చింది.

మోహనుని ప్రవృత్తిమాత్రం ఏమాత్రం మారలేదు. పైపెచ్చు యింటికికూడా రావడం మానేశాడు. దాంతో అన్నపూర్ణమ్మగారికి మనోవ్యాధి అంకురించింది. ఒకనాడు మోహనుడు, భోజనానికి కూర్చున్నాడు. అన్నపూర్ణమ్మగారు వడ్డిస్తున్నది.

'నాయనా! రెండురోజులనుండి ఎక్కడున్నావురా?'

'నీ కెందుకు? ఎక్కడో అక్కడ వున్నాను. యింటికొచ్చి చేసేదేముంది?'

'అదేమిరా అల్లాఅంటావు? నీవు కళ్ళకైనా కనబడితే చాలునని చూస్తోందిరా ప్రభ. భగవంతుడు చేసిన లోపానికి అదేం చేస్తుందిరా? అది మహాయిల్లాలు. దాన్నేడిపించకూడదు.

'నేనూ ఆలోచిస్తూనే వున్నాను. కాని నా మనస్సేమాత్రం ఆవైపు పోవటంలేదు. నేనేంచెయ్యను?

'నాకు శరీరంలో వ్యాధి ప్రవేశించింది. నేను చాకిరీచెయ్యలేకుండా వున్నాను. అది పెడితే తినవాయె. తువ్వాలందిస్తే దూరంగా గిరవాటేస్తావు. మాట్లాడబోతే కస్సుమంటావు. అది లోలోపల కుమిలిపోతోంది. గుణవంతురాలు. అటువంటిది నీకు సప్త జన్మాలెత్తినా దొరకదు.'

'అమ్మా ఇంక చాలించు. ఆ విషయం నాదగ్గిర తేబోకు. ఇలాగయితే నేను యింటికిరాను.'

ఈ విధంగా అన్నపూర్ణమ్మగారు కొడుకును మందలిస్తూవుండేది. కాని మోహనునకు చెవిటివాడి ముందర శంఖూదినట్లు అయ్యేది.

గుణవతియైన కోడలు దుఃఖం చూడలేక అన్నపూర్ణమ్మగారు చాలా బాధపడేది. చివరకు ఆ మనోవ్యాధితోనే మరణించింది. ప్రభావతి అత్తగారు పోయినప్పటినుండి మరింత బెంగెట్టుకుపోయింది. భర్త అనుగ్రహానికి పాత్రురాలను చెయ్యమని భగవంతుని ప్రార్థిస్తూ ఏకాకిలా ఆయింట్లో వుండేది. మోహనుడు వచ్చినరోజు వచ్చేవాడు, లేనిరోజు లేదు. వచ్చినప్పుడైనా నాలుగు మెతుకులు తిని చక్కాబోయేవాడు. తల్లి పోయినప్పటినుండి భార్యచేత్తో తినక తప్పిందికాదు.

సాయంత్రం సుమారు అయిదుగంటలవుతుంది ప్రభ తన దినచరిత్రను తలపోసుకుంటూ అశ్రుకణాలను రాలుస్తూ కూర్చుంది. ఆమె నూరడించేవారెవరు? మోహనుడు వచ్చాడు. బూటుతీసి దుస్తులు మార్చి, కాళ్లు కడుక్కోటానికి కుళాయిదగ్గిరకు వెళ్లాడు. అక్కడ చల్లదనానికి పడుకున్న పామును అతడు చూడక కాలేశాడు. పాము కాలుకు చుట్టేసింది. ఒక్కవిదిలింపు విదిలించి, పాముపామని కేకలేస్తూ ఒక్క అంగలో సావిట్లోపడ్డాడు. కాటుపడలేదని కసికొద్ది పాము చరచరా మోహనునిదగ్గిర కొచ్చేస్తోంది. యిదంతా ప్రభ చూసింది. 'నా స్వామిని అపహరిస్తావా?' అంటూ వెర్రిదానివలె పరుగెత్తి పడగపై మోదింది. అరచేతిలో కాటేసింది. మోహనుడు నిశ్చేష్టుడయాడు. అతని జ్ఞాననేత్రం విడింది. అవ్యాజానురాగం పొంగిపొర్లింది. ఆమె దేవతామూర్తిలా కనబడింది. తానంత దుర్మార్గుడై ఆమెను కష్టపెట్టినా తన కపాయం శంకించి ఎంత త్యాగం చేసింది? భారతసతుల హృదయం అతనికిప్పుడు బోధపడింది. ఆమె పాముకు అడ్డువచ్చి తనవంతు బాధ ఆమె అనుభవించకపోతే తనేస్థితిలో వుండేవాడో! ఇంక ఒక్కక్షణం కూర్చోలేకపోయాడు. చేతులు చాచి, ప్రభా అంటూ పరుగెత్తాడు. ప్రభకు పిలుపు అమృతమైంది. బాధే మరచిపోయింది. తనకోసం మోహనుడు ఆత్రతచెందటం నమ్మలేకపోయింది. ఎదురుగావస్తున్న భర్త చేతుల్లోకి వాలిపోయింది.

'ప్రభా! దుర్మార్గుణ్ణి క్షమించు. బాహ్యరూపం కోరానుగాని; నీహృదయ సౌందర్యం తెలుసుకోలేకపోయాను.

'నాథా! మిమ్మల్ని క్షమించటానికి నేనెంతదాన్ని? నేడు నా నోములు ఫలించాయి. మీ అనురాగానికి పాత్రురాలనయ్యాను.'

'ప్రభా! యింత సాహసం చెయ్యవచ్చునా? చెయ్యేదీ? బాధగావుందా?'

'సాహసమేముంది? నావిధి నేను నిర్వర్తించాను. హైందవసతికి భర్త ప్రత్యక్షదైవము. పతిసేవయే సతికి పరమావధి. నా స్వామిని బాధపెడుతోంటే ఎల్లా వూరుకోగలను? మీ ప్రేమామృతము చవిచూడ గల్గినాను. నాకింకేమీ బాధలేదు. నేనిన్నాళ్ళనుండి దేనికై పరితపిస్తున్నానో అది నాకు లభ్యమైంది. ఇంత కన్న నే కోరతగిందేమీలేదు.'

'ప్రభా! నా అవివేకాన్ని మన్నించు. మాణిక్యాన్ని గాజురాయిగా తలచాను. పూర్వచరిత్ర మరచిపో. నూతన జీవిత మారంభిద్దాము' అని ప్రభావతిని అక్కున జేర్చుకున్నాడు. నాటినుండి ప్రభావతీ మోహనులు నిర్మల ప్రేమమూర్తులై జీవయాత్ర గడుపుచున్నారు.



## మాతృబోధ

శా॥ ఔరా! మొంతటి మోసగాడవో? కో యీయాన్నత్య మేరీతిగా
నే రాజ్యంబుల నేలగంటివో? కో, నన్నీరీతి నాడంగ నీ
నోరాడెఁ, దలపోయ వించుకయు, నన్నూరార్ప, చీ, నీవు నా
గారాపుఁ దనయుండవే? కుటిలుడా కాంక్షింతువే దుర్గతిఁ.

మ॥ జననీగర్భ విదారకుండవయి, నీచంబంచు లోనెంచకఁ
జనముల్ మెచ్చెదరంచు, నీ జన్మంబు వమ్మౌగతిఁ
ఘనతాపంబున మునగజేసితివి నా కన్నీరు గాన్పించదో
విను నీశాత్రవమర్దనోద్యమమున్ నీవిప్పట్టునఁ బట్టుమీ!

ఉ॥ నీదగు దేశమాతృపద నీరజమందలి రేకు లన్నియుఁ
మేదిని గూలిపోవనిక మేల్కొనవిటు నిద్రపోయెదే
యేదరియుఁ గనంబడని యీ సమయంబున నిట్టు జేయుచో
సోదరులుఁ క్షుదార్తులు, కృశోదరులుఁ మననిత్తురే నిన్నుఁ.

గూడూరు సీతారత్నం.

# ధన్యజీవులు

శ్రీమతి
ఆయుపెల్లి
రామలక్ష్మి

హరిజనులు అస్పృశ్యులు కారు. వారూ మానవులే, వారు మన సోదరులు. వారు కష్టపడి చెమటూడ్చి పండించు ధాన్యాదులు మనము తినవచ్చు, వారిచ్చు పండ్లు ఫలాదులు మనం తినవచ్చు. కాని, వారిని తాకకూడదా? అస్పృశ్యత?-ఏ కౌటిల్యము దీని నేర్పరచింది?

శంకరం అప్పుడే కాఫీ త్రాగి వీధిలోకి వచ్చేడు. మాలవెంకడు ఎదురుగుండా ఏడుస్తూ వచ్చి నమస్కారంజేసి,

'బాబూ, రక్షించాలి, చచ్చిపోతున్నాది బాబు' అన్నాడు. శంకరంగారు 'ఏంరా? ఏమిటి ప్రమాదం వచ్చింది? చెప్పు వేగిరంగా'

'బాబూ నాభార్యకు వారంరోజులబట్టి జ్వరం వస్తున్నాది. గర్భిణి బాబూ. యీరోజున ఉష్ణం హెచ్చింది. తమరొకసారి దయచేసి యీ దీనుణ్ణి రక్షించాలి. బాబూ' అన్నాడు శంకరం పాదాలమీదపడి.

శంకరం వాడినిచూడగానే అతని జాలిగుండె వెన్నవలె కరిగిపోయింది. యిక వాడి ఏడ్పు వినలేక వెంకడిని లేవనెత్తి భయంలేదని చెప్పి తీసుకెళ్లేడు.

వెంకడి సంతోషానికి మేరలేదు. శంకరం రోగిని పరిక్షించి మూడుమోతాదు లిచ్చాడు. వాటి అనుపానము మున్నగునవికూడ చెప్పి, 'యింకభయములేదురా, ఒకవారం రోజులకల్లా పురుడు వస్తుంది' అని చెప్పి వెళ్ళిపోయేడు. వెంకడు తన కృతజ్ఞతను చూపుతూ నమస్కరించాడు.

శంకరం వెంకటశాస్త్రికి ఒకడే కొడుకు. బి. ఏ. పాసయ్యాడు. కాని యిప్పటికాలంలో ఉద్యోగ మెవరిస్తారు? ఏ కోమటికొట్టు దగ్గరన్నా ఉద్యోగము దొరుకుతే వారిచ్చిన పదిహేను రూపాయిలకు వారుచెప్పిన పనులు చెయ్యడం, తిట్లు, తన్నులుతినడం! అటువంటి ఉద్యోగాలు చెయ్యడం శంకరాని కిష్టం లేదు. తనపూర్వీకుల దగ్గరనుండి వస్తూన్న వైద్యం నేర్చుకున్నాడు. వెంకటశాస్త్రి పూర్వాచార పరాయ

ఱుడు. పిత్రార్జితమైన మాగాణీవల్ల సాలుకి రూ 1500 వస్తాయి. శంకరానికి మేనరికం చేసేరు. 'గంతకు బొంతన్నట్లు' సరళ శంకరానికి తగ్గా ఉంది. నవనాగరికురాలు, జాలి, దయ, ప్రపంచానుభవము కలది.

వెంకడు మాలపల్లి కంతటకు పెద్ద. ఆ మాలలందరు అతనిమాట శిరసావహిస్తారు. వెంకడు శాస్త్రిగారి పొలందున్నుతూ దానివల్ల వచ్చే ధాన్యపుగింజలవల్ల జీవిస్తున్నాడు.

శంకరం మాలపల్లికివెళ్లి వెంకడికి మందిచ్చేడన్న సంగతి ఆ మర్నాడే ఊరంతా పాక్కిపోయింది. కొందరు సనాతనులు శాస్త్రిగారిని హెచ్చరించారు. కొందరు నవనాగరికులు శంకరాన్ని పొగిడేరు. ఆ రోజునే శాస్త్రి కొడుకును పిలిచి,

'ఏంరా? అబ్బాయీ, నువ్వు నా పరువు తీస్తున్నావు. బ్రాహ్మణీకాన్ని మంటగలుపుతున్నావు! ఆ కిరస్తానీ చదువులు చదివించనంటే మీ అమ్మ శతపోరుపెట్టింది. నువ్వు మాలపల్లి వెళ్లటం నిజమేనా??

శంకరం:. 'నాన్నగారూ, నేను మాలపల్లి వెళ్లడం నిజమేను. నేనుగాని అప్పుడు వెళ్లకపోయినట్టయితే ఆ నిండుమాలాలి గతేమికాను? వాళ్లనంటుతే వచ్చిన నష్టమేమిటి? వాళ్లూ మనలాటి మానవులే, హృదయముకలిగి, కూడుతిని గుడ్డ కట్టవలసినవారే. ఏ శాస్త్రములో మాలవాళ్లు అంటరానివారని ఉన్నదో చెప్పండి. పురాణేతిహాసములు కూడా హరిజనులు అస్పృశ్యులని చెప్పలేదు. మహారామాయణ గ్రంథము రచించిన వాల్మీకిమహాముని పంచముడుకాడా? శ్రీరామునికి తండ్రివంటివాడును, గురువును అగు వశిష్టుడు హరిజన స్త్రీయైన అరుంధతిని వివాహమాడలేదా? మన మనుధర్మశాస్త్రములో నాల్గు వర్ణములే ఉండెడివి. కాని క్రమేపి ధనవంతులు షడ్రసోపేతంగా భుజించుచు ధనమదాంధులై, శరీర పరిశుభ్రతలేక గంజినీల్లు త్రాగి బ్రతికినవారిని అస్పృశ్యులనియు, కడజాతివారనియు అనిరి. అటువంటివారికి సహాయముచేయుటే మనవిధి. వారిని, నీచదశనుంచి తొలగించి వారికి కావలసిన సౌకర్యములు ఒనగూర్చుటకు నేను కంకణము కట్టుకొంటిని'

శాస్త్రి:-శంకరం! యిదే నీకుఆఖరుసారి చెప్పటం. ఆ మాలలను మనమంటరాదు. అవి మన పూర్వీకులు చెప్పిన వాక్యములు. వాటిని మనం అక్షరాలా జరిపించి తీరవలయును. నువ్వు యిక ఆ వ్యాపారమును కట్టిపెట్టు. అట్లుకానియెడల నిన్ను నా యింట్లో వుంచకపోవడమే కాకుండా నా ఆస్తిలో పీసమంతయినా నీకు చెందనివ్వను.

శంకరం:-నాన్నగారూ, మీఆస్తి, యిల్లు నాకవసరములేదు. నాకు నా సోదరులే ఆస్తి. వారిచ్చు పాకయే నాకు యిల్లు. వారు కష్టపడి చెమటూడ్చి పండించు ధాన్యాదులు మనము తినవచ్చు, వారిచ్చుపండ్లు ఫలాదులు మనం తినవచ్చు. కాని, వారిని తాకకూడదా? మీరు నన్ను యీ విషయములో క్షమించాలి. యిప్పుడే మీయిల్లువిడిచి పోతున్నాను' అంటూ శంకరం తండ్రికి నమస్కరించి తల్లిదగ్గరకు వెళ్లేడు.

వెంకటశాస్త్రి పండ్లు పటపట కొరుకుతూ 'దుర్మార్గుడా! తండ్రిమాట విననివాడు కొడుకా? యీక్షణమందే, నా కీజన్మలో నీమొగము కనపర్చకుండా, పో!' అని గర్జించెను.

శంకరం, తల్లి వారిస్తున్నాగాని వినకుండా, బయలుదేరేడు. సరళకూడా వెళ్లటానికి సిద్ధమయింది. అత్తగారు అమెచెయ్యిపట్టుకొని వెళ్లవద్దనిచెప్పింది. కాని సరళ 'అత్తగారూ, నాకు దేవుడైన నా భర్తను

విడిచి నేనుండలేను. నా పతిచరణములే నాకుగతి' అని నమస్కారముచేసి పట్టువిడిపించుకొని తనభర్తవెనకాల బయలుదేరింది. శంకరం తిన్నగా మాలపల్లెవైపు వెళ్ళేడు. యీ సంగతి మాలపిల్లలకి తెలిసింది. అందరూ తలో కర్ర పట్టుకొని బ్రాహ్మణవీధి వస్తుండగా, శంకరం వారిని శాంతివచనాలతో, తిరిగి పంపించాడు.

శంకరాన్ని, అతనిభార్య సరళని మాలజనమంతా తమపల్లెకు తీసుకొనివెళ్లారు. అందరూ పళ్లు, ఫలములూ, పాలు వారు వద్దనినను తెచ్చియిచ్చేరు. ఆ మర్నాడే ఆ ఆనంద దంపతులకు అచ్చట ఒకపాక వేయబడినది. శంకరం తనకుటీరంప్రక్కనే మరొకపాక వేయించి ఒక బడి స్థాపించాడు. దానిలో స్త్రీ బాల వృద్ధులుకూడా ప్రవేశించారు. శంకరం వారందరకు ఆరోగ్యవిధులగురించి, గాంధిమహాత్ముని తత్వోపదేశము గురించి ఉపన్యాసాలిస్తూఉండేవాడు. అచ్చట కొన్ని రాట్నాలు పెట్టేడు. స్త్రీలు వృద్ధులు నూలువడుకుతూ కాలక్షేపంచేసేవారు. బాలురు వ్యాయామపరిస్థితులందు, చదువుయందు, కాలక్షేపంచేసేవారు. సరళ స్త్రీలకు గృహాలంకారముగురించి చెప్పి వారివారి గృహములను పరిశుభ్రముగను, ఆరోగ్యవంతముగాను, తయారుచేయించింది. వారికి శిశుపోషణగురించి చెప్పింది. శంకరం మాలపల్లినంతటను శుభ్రముగా చేయించాడు. వారిచే కల్లు మాన్పించాడు. వెంకడు తనకు కలిగిన కొడుకును శంకరయ్య అని పిలిచేవాడు.

వెంకటశాస్త్రి, శంకరం వెళ్లిపోయిన దగ్గరనుంచీ, నీరసించిపోయేడు. క్రమేపి అది జబ్బులోకి దించింది. మంచంపట్టిపోయేడు. తన మూర్ఖపు పట్టుదల వదిలేసుకున్నాడు. శంకరాన్ని పిలిపించి దగ్గరగా తీసుకొని 'నాయనా, ఆఖరికి నీ పంతమే నిల్చింది. హరిజనులు అస్పృశ్యులుకారు. వారూ మానవులే, వారు మనసోదరులు. ఏ శాస్త్రములో చూచినా హరిజనులు అస్పృశ్యులు కారనే చెప్పబడ్డది. మొదట అది గ్రహించుకోలేకపోయాను. హరిజనులకు తగిన సేవచేస్తూ హాయిగా కాలక్షేపంచెయ్యి'అని వెంకటశాస్త్రి చెప్పి, తనప్రాణాలను అనంతవాయువులో ఐక్యముచేసేడు.

శంకరం తండ్రికి చేయావలసిన యథాక్రియలు నెరవేర్చేడు. తనకు సాలీనావచ్చే ధనములో కొంత ఖర్చుపెట్టి హరిజన సంఘమును స్థాపించేడు. తనయింటికెదురుగా ఒకచావిడి కట్టించేడు. దానిలో రాట్నముల మీద నూలువడికించేవాడు. తనభూములలో ప్రత్తి వేయించేవాడు. యిప్పుడు ఏ మాలను చూచినా శుభ్రముగను ఖద్దరుకట్టినవాడై కనుపిస్తాడు. ఆ ధన్యజీవులు ఆగ్రామములోనే కాకుండా ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లోను హరిజనులకు రైతులకు ఆదర్శప్రాయులైయ్యారు. శంకరం రైతుల బాధలనుకూడ నివారణ చేసేవాడు. ఏ కలహమొచ్చినా శంకరమే తీర్పుచెప్పాలి. ఎవరికే జబ్బువచ్చినా శంకరమే మందుయిచ్చేవాడు. ఆ వూళ్లోవున్న కొందరు సనాతనులు శంకరాన్ని అతని కుటుంబమును వెలివేశామన్నారు. కాని శంకరం సరళ వారిమాటలకు జడియక తమ జీవితాల్ని తమ సోదరుల సేవక్రింద వ్యయపరస్తూ ధన్యజీవులయారు.



# ఆహార-విజ్ఞానం

ఆరోగ్యసూత్రాలు తెలుసుకొనుటకు ఆహార విజ్ఞానం అత్యంతావశ్యకము. కృత్రిమ జీవనపద్ధతులు హెచ్చిపోవుచున్న ఈ రోజులలో అవసరమయిన సూచనలను ఈ వ్యాసంలో రచయిత చేసినది. ఆరోగ్యమే సౌభాగ్యము అని నమ్మువారికి, ప్రకృతిసహాయమందు విశ్వాసమున్న వారికి, సాత్వికాహారము మేలు తెలియగోరువారికి ఈ వ్యాసం ఉపయోగపడగలదు.

● వల్లభనేని రంగాదేవి ●

"నిప్పు రగల్చడం చేతనైనపిమ్మటనే మానవులపతనం ప్రారంభమైన"దని డాక్టరు లోవ్యసాల్డు అన్నాడు. నిజంకూడా అదేనని నా యుద్దేశం. నిప్పురగల్చడం తెలియక పూర్వం ప్రకృతి ప్రదత్తమైన పండ్లు, దుంపలు, ఆకులు తింటూ వుండేవారు. అప్పుడు ఆనందంగా సాత్విక-బుద్ధితో యింద్రియాలను స్వాధీనంలో వుంచుకొనెడివారు. ఇప్పుడా యింద్రియ నిగ్రహంలేదు. అందువల్ల జనసంఖ్య వృద్ధియగుచున్నది. దాని కారణంగా, వుండటానికి భవనం-తినడానికి భోజనం-అవసరమైనవి. ఇవి చాలినంతగా దొరకని కారణమున-యొండొరులు కత్తులు నులుముకొనుచున్నారు. వీటన్నిటికీ కారణ మీ యప్రాకృతిక జీవనమే. గాన మళ్లీ శాంతంగా-ఆనందంగా దీర్ఘజీవితంతో కాలం వెళ్ళబుచ్చాలంటే-దైనికాహారంలో మార్పుదెచ్చి, ప్రకృతి ప్రదత్తమైన యాహారాన్నే స్వీకరించాలి.

స్త్రీలలో క్షయరోగ మెక్కువ వ్యాపించుటకు కారణమేమిటా అని యాలోచిస్తే, పొయ్యి వూదుటకూడా ఒక కారణమని తేలింది. వంటింటి పొగవల్లనే స్త్రీల యారోగ్యం చెడుచున్నది. వంటిల్లు నలువైపులా గాలి వచ్చునదిగా వుండాలి. ఆరుబైట పొయ్యివుంటే మరీ మంచిది. మట్టిపొయ్యి వుండాలి. ఇనుపపొయ్యిమీద వండిన పదార్థాలు తొందరగా జీర్ణానికిరావు.

వంట పాత్రలన్నీ మట్టివిగాని రాతివిగాని కొయ్యవిగాని అయియుండాలి. లోహపాత్రలు శరీరంలో విషాన్ని జేరుస్తవి. మట్టిపాత్ర లుపయోగిస్తే అసభ్యత దాపురించదు సరిగదా బుద్ధి వికాస మేర్పడుతుంది. ఆచరణమీద అనుభవమైతే ఎక్కువకాలం నిలుస్తుంది. ఆచరించి చూడండి.

ప్రతినిత్యమూ ఎక్కువగా ఇండ్లలో వాడుకొను-పిండిబియ్యము-యంత్రములమీద తయారయినవే సామాన్యంగా. కాని ఆ విధంగా యంత్రములమీద తయారయిన వాటిలో జీవకణాలు నశించుతవి; అందుచే యంత్రములలో తయారగువాటిని విసర్జించాలి. చేతిమీద తయారయినవాటిని వాడుకలోనికి తెచ్చుట మంచిది. అందులోకూడా యెక్కువరోజులు నిలువ వుంచకూడదు. పొట్టు-తవుడు మొదలగు

అందుండు పదార్థాలను-చెరగుట మూలంగాను-కడుగుట మూలంగాను తొలగిస్తారు. అది చాలాపొరపాటు. అందు మంచి పౌష్టికశక్తి వుంటుంది. కడగుటద్వారా అది కాస్తా అంతరిస్తుంది. ఆపై మలబద్ధకం మొదలగు వ్యాధులు ప్రవేశిస్తవి. దానిలోనున్న మలం రోగాలకు మూలమౌతుంది. దంపుడుబియ్యమే శ్రేష్టము. అందు కూడా గంజి పారబోస్తారు. అది కూడా తప్పే. సరిపడు యెసరుబోసి యిగరనిచ్చుట మంచిది.

పప్పు పదార్థాలుకూడా యెక్కువ దంచకూడదు. పైపొట్టు తొలగగూడదు. పొట్టు తొలగిన పప్పుతింటే అరుగుదల సన్నగిల్లును.

నిత్యమూ భోజనవ్యహారాల్లో ఆకుకూరలకు ప్రధమస్థానం యివ్వాలి. అంటే ముఖ్యముగా రోజూ ఆకు కూరలే వాడాలి. రోజూ నూటికిఅరువదిపాళ్లు-పండ్లూ-ఆకులూ వాడుతుండాలి. అందులోకూడా పైపెచ్చుతో సహా తింటూ వుండాలి. అదేశ్రేష్టము. దుంపలు-కాయలు-వుడకబెట్టి ఆనీరు పారబోసెదరు. అలా పార బోయక, ఆ నీటినికూడా వుపయోగములోనికి తేవలయును.

ఉసిరికాయ-మాగాయ-నిమ్మకాయ మొదలగు మాగినపచ్చళ్లు-మామిడికాయ మొదలగు తేనెలో వూరవేసినపండ్లు- సదా వర్జనీయములు. వాటిబదులుగా,కొత్తిమేర-పొదీన-మొదలగు ఆకుకూరపచ్చళ్లు తాజావి చేసుకుని తింటూండవచ్చును.

మిఠాయి మొదలగు చాలా తినుపదార్థాలు-నూనెతోను నేతితోను-తయారుజేస్తారు. వాటికికూడా మనం దూరంగ వుండుట శ్రేయస్కరం. తినబోయే పదార్థాలు-రుచికంటే-ఆరోగ్యానికి మంచిదాకాదా అని తర్కించుకోవాలి. ఆకలివల్ల రుచిపెరుగుతూవుంటుంది. కాని రుచివల్ల ఆకలిపెరుగుచున్నట్టుగా భావించి మనం అధికంగా తింటూ మృత్యువుని ఆహ్వానిస్తున్నాము.

చద్దిభోజనం కూడా చావులకు కారణమై కూర్చుంది. చద్దితింటే-అరగక-అజీర్తిపుట్టి-లోన క్రుళ్లి దుర్గంధపూరితమై నానా హంగామా చేస్తుంది. చాలా ఇండ్లల్లోబద్ధకం వల్లనైతేనేమి, పుల్లల ఆదాకైతేనేమి రోజుకు ఒకేసారి భోజనం తయారు జేస్తారు. అది యేమౌతుంది? మొదటికే ముప్పుతెస్తుంది. కొంత మందేంచేస్తారు? చీకటితోనే ఉదయం పిల్లలకు చద్దిగుడిపించుతారు. ఇదికూడ పొరపాటే. వర్జనీయమే.

కొన్ని ఇండ్లలో పలుపదార్థాలు ఒక్కొక్కసారి భోజనంచేస్తూ-యిదేనాగరికతా లక్షణమనీ-వున్నందుకు అనుభవించవద్దా అనీ-తృప్తిగా భోంచేసామనీ-అనుకొంటూ ఉంటారు. అది తృప్తికాదు. దీర్ఘంగా ఆలోచిస్తే-యింతటితో యీప్రపంచ సౌఖ్యాలకు తృప్తిపడి మిత్తిని నెత్తికి దెచ్చుకునే తృప్తి అది.

మనం పంచదార-యంత్రాలలో తయారగు బియ్యం-పప్పు-పిండి-పిండిపదార్థాలు-బిస్కటులు మసాళావుస్తువులు-టీ కాఫీ-కోకో-మొదలగు వాటికి వాడుకలో స్థాన మివ్వరాదు.

ఆకలగునప్పుడే అన్నము దినుట రోగవిముక్తికి కారణం. అన్నము నమలి మ్రింగాలి. ఎక్కువ నమలితే చొంగజనించును. ఆచొంగే జీర్ణకారి. జీర్ణమే ఆరోగ్యము. ఆరోగ్యమే ఆయుర్వృద్ధి.

# "దంపతీ తాంబూలాలు"

—— శ్రీమతి పి. ఎస్. ప్రకాశమ్మ ——

(జానకమ్మగారి యిల్లు - జానకమ్మ, సోమమ్మ ప్రవేశిస్తారు.)

జానకమ్మ:- ఏమండీ, సోమమ్మగారూ మిమ్మల్ని ఎన్నిమాట్లో అడుగుదాం అనుకునేదాన్ని కాని తీరా నాలిక చిగురికొచ్చేటప్పటికి మనకెందుకనిపించి, ఊరుకునేదాన్ని.

సోమమ్మ:- జానకమ్మగారూ, ఎందుకూ అంత సందేహం? అదేమిటో అడిగెయ్యండి.

జాన:- అబ్బే, మరేంలేదు. మీ దంపతులిద్దరూ రోజూ ఎక్కడికో వెడుతూంటారు. ఎందుకుచెప్మా? అనుకుంటున్నా.

సో:- మీయిల్లు బంగారంగాను. ఇదా ఆఖరుకి మీ ధర్మసందేహం? ఈ మాత్రం అడిగి తెలుసుకోడానికేనా ఇంత తికమకలు! చెబుతావినండి—నేనూ మా వారూ రోజూ తాసిల్దారుగారింటి కెడుతున్నాం. తాసిల్దారుగారి పెళ్లాం దంపతీ తాంబూలాల నోముపట్టింది. మావారేమో ఆవిడతో 'అమ్మోయ్, సిరి, సంపదాఉన్న సమర్థురాలవు గనక నువ్వీనోము తప్పకుండాపట్టు. దీనివల్ల మీకు దాంపత్యసుఖం, ఐశ్వర్యం యింకా అభివృద్ధవుతాయ్.' అని చెప్పేరట. ఆవిడకి శాస్త్రుల్లుగారెంత చెబుతే అంత. ఆయనమాట శిరసావహించి, రంగనాయకమ్మగారు ఆనోముపట్టింది. అందుకోసమని రోజూ మేమిద్దరం వాళ్లింటి కెళ్లవలసొచ్చింది.

జాన:- అలాగనా? సరేకాని, ఎన్నాళ్లేమిటీనోము? మీరిద్దరూ పార్వతీ పరమేశ్వర్లుకుమల్లే కలిసి వెడుతోంటే చాలాకాలంనుంచి చూస్తున్నా.

సో:- ఆ! ఒక్క యేడాదినుంచి వెడుతున్నాం. ఇంక పూర్తిఐపోయింది లెండి. ఎల్లుండితో సరి. ఆవేళ ఉద్యాపన చేసేసుకుంటుంది.

జాన:- అబ్బా! ఏడాది పొడుగునా నోమే! ఏంచెయ్యాలండీ, రోజూనూ?

సో:- రోజూ పదిహేను తమలపాకులు ఐదు చెక్కలూపెట్టి ఓ దంపతులకి తాంబూలం ఇవ్వాలి, అంతే.

జాన:- మూడువందల అరవై రోజులూ ఓ దంపతులకే తాంబూలం యివ్వాలి కామోసు. వాళ్ల కోనాడు ఏదైనా యిబ్బందొచ్చి వెళ్లకపోతే చిక్కు కాదూ?

సో:- అబ్బే, ఏడాదీ ఓ దంపతులకే యివ్వాలనిలేదు. ఎవళ్లు సందర్భపడితే వాళ్లకే యివ్వచ్చు. మే మేదో ఆశ్రయించుకున్నాం గనక రోజూ మమ్మల్నే రమ్మంటోంది.

జాన:- బాగానేఉంది కాని, తగినంత దక్షిణయిస్తే తప్ప రోజూ ఎండవేళ అరమైలు వెళ్లడం, అరమైలు రావడం అన్నా కష్టమే. ఏమంటారు?

సో:- కష్టమే అనుకోండి. కాని రోజూ దక్షిణ యిస్తారా, జానకమ్మగారూ? ఏటికేడాదీ మేంపడ్డ కష్టానికి సరిపోయేటట్లు, రంగనాయకమ్మగారు ఎల్లుండి ఉద్యాపన చేసుకున్నప్పుడే ముట్టచెబుతుంది.

జాన:- ఔన్లెండి. కాని, ఈ నోముకి ఉద్యాపనంటే ఏం చెయ్యాలి?

సో :-నోము చేసుకునే యిల్లాలు శుభ్రంగా స్నానంచేసి పట్టుచీరా రవికా తొడిగి, చక్కా పసుపూ కుంకం పెట్టుకుని దంపతులికి పూజ్చెయ్యాలి. ఇదయ్యాక, ఓ పట్టెమంచం, పరుపూ, పాన్దానీ, ఓ కంచు చెంబూ, గ్లాసూ—ఇలాంటి పడకగది సామానంతా చేర్చి ఆ దంపతులకి దానం ఇయ్యాలి. సరదా ఉంటే, అగరొత్తులూ, సెంట్లూ—ఇలాంటివికూడా ఇవ్వొచ్చనుకోండి. కొందరేమో దంపతులకి పట్టుచీరా, పంచలచాపూ కూడా ఇస్తారు. ఎక్కడికి దీనికి? 'విత్తంకొద్దీ వైభవం' అన్నారు. డబ్బుండి, సరదాఉంటే ఎంతైనా చెయ్యొచ్చు.

జాన :-పడగ్గది సామానంతా యివ్వాలీ అంటే చాలానే ఔతుంది ఖర్చు.

సో :-అవకేం? తాసిల్దారుగారి భార్య అప్పుడే దాదాపు అరవై, డెబ్బై రూపాయలు ఖర్చుపెట్టి మంచం పరుపూ, అన్నీ తెప్పించింది. పట్టుచీరే అవీకూడా కొనేటట్లే ఉంది చూస్తే. చిగురికేవో ఇలాంటివి ముట్టచెబుతుందిఅనే కాదూ రోజూ మేము శ్రద్ధగా వెళ్లి వస్తూంట మతి?

జాన :-ఔన్లెండి, కాని తాసిల్దారుగారు రంగనాయకమ్మ నోముకోసమని ఇంతఖర్చు కొప్పుకున్నారంటే ఆయన చాలా మంచివాడన్నమాట.

సో :-ఆ. భార్యసరదాపడుతోందీ అంటే, ఆయన డబ్బుఖర్చుకి ఎంతైనా సరే వెనకతియ్యడు. అంతేకాదు. ఆయనికి ఏ విషయంలో ఐనా ఆవిడ ఎంతచెబుతే అంత. అందుకే 'నోము ఉద్యాపననాటికి, అల్లుణ్ణి రమ్మని ఉత్తరంరాయండి' అని ఆవిడంటే, 'ఈ మాత్రందానికి, చదువుకుంటూన్న పుత్రాణ్ణి శెలవుపెట్టించి, రప్పించడం ఎందుకు?' అని సందేహించక ఆయన కార్డురాసి పారేశాట్ట.

జాన :-ఓహో, అలాగనా? రంగనాయకమ్మ నోము ఉద్యాపన ఏదో చాలా వైభవంగానే జరిపేటట్లుంది చూస్తే.

సో :-ఆ, చూద్దురుగాని. మీరూ, మీరూ చుట్టాలుగా. మిమ్మల్ని పిలవకుండా చెయ్యరేం చేసినా. వెళ్లొస్తా మరి.

జాన :-మంచిది.

జానకమ్మగారి యిల్లు - రెండవదినం - జానకమ్మ రంగనాయకమ్మా ప్రవేశిస్తారు.

రంగనాయకమ్మ :-ఏమండోయ్, జానకమ్మగారు.

జాన :-ఓహో, రంగనాయకమ్మగారా? రండి, రండి......మీరెందుకొచ్చారో చెప్పనా, రంగనాయకమ్మ గారూ.

రంగ :-ఎలా చెప్పగలరు? మీకేమైనా జోస్యం తెలుసా?

జాన :-ఈమాత్రందానికి జోస్యమెందుకండీ? మీరెందు కొచ్చారో మీ పట్టుచీర చెబుతోంది.

రంగ :-బాగా చెప్పేరండి. ఐనా బొట్టుపెట్టి చెప్పడం లాంఛనంగనక చెప్పేస్తాను. రేపు దంపతీ తాంబూలాల నోము ఉద్యాపన చేసుకుంటున్నాను. మీరు తప్పకుండా రావాలి.

జాన :-అలాగేం. ఐతే మీ అల్లుడొచ్చాడా?

రంగ :-చాలా చిత్రంగా ఉందే? మా అల్లుడొస్తాడని కూడా ఎలా తెలిసింది, మీకు?

జాన :- తెలియడానికేముందిందులో? 'ఎంతో వైభవంతో మీరు నోముకి ఉద్యాపన చేసుకుంటూన్నప్పుడు ముచ్చటకని అల్లుణ్ణి పిలవకపోతారా?' అనుకున్నా అంతే.

రంగ :- కేవలం ముచ్చటకోసమని రమ్మంటామా? అందులో అతగాడికి పరీక్షలుగూడా దగ్గిర పడ్డాయిట.

జాన :- అలాగైతే, మరెందుకు రప్పించినట్లు?

రంగ :- దంపతీ తాంబూలాలంటే మీకు తెలుసునుకాదూ?

జాన :- తెలియకేం? నిన్న సోవమ్మగారు చెప్పింది. ఓ దంపతులకి పూజచేసి, పడకగది సామానంతా దానమివ్వాలిట కాదూ?

రంగ :- ఔను. అందుకోసమనే, అల్లుణ్ణి రమ్మన్నాను. లేకపోతే రైలు ఖర్చులుపెట్టి ఇంతదూరం రమ్మనడం ఎందుకు?

జాన :- ఏమిటీ అన్నారు!

రంగ :- మీరేదో పరధ్యాన్నంగా ఉన్నట్లున్నారే? రేపు దానం ఇవ్వడంకోసమని అల్లుణ్ణి రమ్మన్నాను.

జాన :- ఊహూ! ఆ పడకగదిసామాను ఉద్యాపనలో మీ కూతురికీ అల్లుడికీ ఇద్దామనా?

రంగ :- ఔను. ఏం? అలా ఆలోచిస్తున్నారు?

జాన :- అబ్బే ఏంలేదండీ. 'దానం అనేది పైవాళ్లకేగాని, ఇంట్లోవాళ్లకివ్వొచ్చా?' అనుకుంటున్నా.

రంగ :- ఔను. మొదట మావారుకూడా అదే అన్నారు. కాని నేచెప్పేదేమిటంటే, కూతురికి పెళ్లి ఎప్పుడైతే చేశామో, ఆనాటినుంచీ అది పరాయిదే. లేకపోతే బోలెడు సొమ్మోసి కొన్న సామానంతా ఎవళ్లకో యిచ్చుకుంటామటండీ?

జాన :- అబ్బే, నేనందుకోసం అనలేదండీ. 'కూతురూ అల్లుడూకూడా మనకంటే చిన్నవాళ్లు కదా, ఆ చిన్న దంపతుల్ని కూచోపెట్టి, పెద్దవాళ్లు పూజచెయ్యడమనీ, నమస్కారం పెట్టడమనీ, ఇలాంటివి జరపచ్చా?' అనుకుంటున్నా అంతే.

రంగ :- ఆ. దానికేమిటి లెండి! పూజచేసేటప్పుడు వాళ్లు ఓ పుణ్యదంపతులనే భావం మనస్సులో పెట్టుకుని పూజచేస్తాంకాని, కూతురూ, అల్లుడూ అనుకుని పూజచేస్తామా? ఆమాటకొస్తే మనకంటె పెద్దవాళ్లైన దంపతులు పైవాళ్లలోనైనా లభించకపోవచ్చు. అబ్బే వయస్సుకీ దీనికీ సంబంధం లేదండీ.

జాన :- ఔతే రేపు శాస్త్రుల్లుగారూ, సోవమ్మగారు కూడా వస్తారా?

రంగ :- పూజ చేయించడంకోసం శాస్త్రుల్లుగారొస్తారు. బహుశః సోవమ్మగారూ వస్తుంది. ఏమీ, అలా అడిగేరు?

జాన :- మరేంలేదు. ఆ దంపతులుకూడా ఏదో ఆశపెట్టుకున్నట్లు తోస్తోంది.

రంగ :- దేనికోసమని? ఆశ కంతుండదులెండి. పోనీ బీదవాళ్లుగదా అని ప్రతీరోజూ ఏటికేడాదీ తాంబూలం వాళ్ళకే యిచ్చేదాన్ని. వాళ్లొకొక్కప్పుడు ఆలస్యంగా వచ్చినా తాంబూలం మరోహళ్ల కిచ్చెయ్యకుండా వాళ్లకోసం అట్టేపెట్టి ఉంచేదాన్ని. ఇంతకంటే ఏమిచెయ్యం? రేపూపూజ చేయించినప్పుడు

శాస్తుల్లుగారికి దక్షిణక్రింద ఒకటో రెండో ఏలాగా ముట్టచెబుతా......వెళ్లిరానా మరి? ఇంకా చాలామందిని పిలవాలి.

జాన :- మంచిది.

(జానకమ్మగారి ఇల్లు - మూడవరోజు - జానకమ్మ, సోమమ్మ ప్రవేశిస్తారు.)

సోమ :- అయ్యో జానకమ్మగారూ, చివరికి రంగనాయకమ్మగారు ఏమిచేసిందో చూశారా?

జాన :- ఏమి జరిగిందో చెప్పండి.

సోమ :- అల్లుణ్ణి ముచ్చటకోసం పిలిపించారనుకొన్నాను గాని కూతురుకీ అల్లుడికీ దంపతీ పూజ్చేసి, ఆఖరికి మానోట్లో కరక్కాయ కొట్టారనుకోలేదు.

జాన :- ఇలా జరుగుతుందని తెలిస్తే, నా కసహ్యం వేసి నేరావడం మానేశా.

సోమ :- ఏం? నిన్నుపిలవడాని కొచ్చినప్పుడు 'ఇలా కూతురి కిచ్చుకుంటాం' అని చెప్పిందాఏమిటి?

జాన :- ఆ. ప్రసంగవశాత్తూ చెప్పింది.

సోమ :- ఏటికేడాదీ రప్పించి ఆఖరికి ఎంత అన్యాయంచేసిందో చూడండి. నేను ఉండబట్టలేక మీతో చెప్పుకుంటున్నాను. భోజనం చేసిచెయ్యడంతో ఎండలో రోజు గుండెలు కమురుక్కుంటూ వెళ్లేవాళ్లం.

జాన :- ఔనమ్మా. ఒకరోజా, రెండురోజులా? ఏటికేడాది వెళ్లేరు పాపం!

సోమ :- అలా శ్రమ పడినందుకు మాకు ముట్టినవి ఆ తాంబూలాలే. 'ఇట్టే వచ్చినమ్మకి పట్టుచీర, ఆశపెట్టుకున్నమ్మకి గోచిపాత' అన్నట్లు తాంబూలం ఖర్చుతో ఆవిడ నోము ఫలితం అంతా సంపాదించుకో దలచింది. పోనీలెండి. సంపాదించి అనుభవించ నియ్యండి 'వెలుసులభం, ఫలం అధికం' అంటే ఇదే కామోసు.

జాన :- సోమమ్మగారూ పోనిద్దురూ. ఇంక ఆవిడ గొడవ తలపెట్టుకుని ఆట్టే ఇదవకండి. 'నోముచేసుకున్నట్లూ అవుతుంది. పిల్లకి ఇప్పుడే సారిపెట్టేసినట్లూ ఐపోతుంద'ని ఆలోచించి ఇలా చేసింది, రంగనాయకమ్మ. ఇలాంటి నోముచేస్తేనేం? చెయ్యకపోతేనేమి? మనలో ఉండే ధర్మబుద్ధి వికసించి, మన శక్తికొద్దీ ఎంతోకొంత, యోగ్యులైన పేదవాళ్లకి ముట్టచెప్పటకోసం నోములంటూ పుట్టేయి కాని, ఈ వంకపెట్టుకుని కూతుళ్లకి సారెలూ, చెల్లెళ్లకి కానుకలూ ఇచ్చుకోవడంకోసం పుట్టేయా? ఇలాంటినోములుచేసి ఫలితం సంపాదించుకోవాలంటే, ఇచ్చేసెయ్యడానికి భగవంతుడంత వెట్టివాడా?

సో :- ఫలితంమాట ఎలాఉన్నా నోముచేసుకున్నామన్న గొప్పవచ్చింది చూడండి.

జాన :- గొప్పా. ఎందుకూ ఈగొప్ప? ఎవరుచూసి సంతోషిస్తారని? సోమమ్మగారూ, ఒక్కమాట చెపుతా వినండి. ఈ విధంగా నోములుచేసి 'నేనూచేశాను నోము' అని చెప్పుకోడమనేది, భగవంతుణ్ణీ, ప్రజల్నీ అనవసరంగా మోసంచెయ్యడంకోసం ప్రయత్నించడమన్న మాట. దీనివల్ల, వీళ్లని మెచ్చుకునేవాళ్లు లేకపోవడమేకాకుండా, నలుగురూ వీళ్ల తెలివితక్కువా లోభత్వం చూసి నవ్వుతారు.

సో :- మీ తల్లికడుపు చల్లగా, ఉన్నమాట చెప్పేరండీ మీరు.

# ★ దసరా బహుమానము ★

శ్రీమతి ఆచంట సత్యవతమ్మ

సుశీల, మాలతి చిన్ననాటి స్నేహితులు. ఒక్క గ్రామంలో పుట్టి, ఒక్కబడిలో చదువుకున్నారు. స్నేహానికి ఏబంధుత్వం చాలదు. మరిచిపోనిది, నిర్మలమైనది, సుహృదలక్షణం. చెడి చెల్లెలింటికి వెళ్లేకంటే స్నేహితు నింటికివెడితే మేలన్నారు. కృష్ణకుచేలులు చిన్ననాటి మిత్రులు. ఒకరు లక్షాధికారి ఒకరు భిక్షాధికారి. అయితేమాత్రం, కృష్ణ పవిత్రస్నేహ భావము, కుచేలుని బాహ్య బీదత్వాన్ని గమనించిందా? నిరాకరించిందా? ఆత్మతత్వ భక్తికి మెచ్చి, సాయుజ్య సౌధాలిచ్చింది.




అట్టి నిర్మల మాధురీ తత్వమే సుశీలది. మాలతి పేదపిల్ల. సౌందర్యవతి. అయితేనేమి. ప్రస్తుత ధన మోహ వరులా సుందరరూపసంపదను త్రోసేశారు. శక్తిలేక మాలతి తలిదండ్రులు మాధవుడనే పేదవిద్యార్థి కిచ్చి పెళ్ళిచేసి ధన్యులయ్యారు. మాధవుడు వారాలు చేసుకొని భుక్తిని యాచించి తెచ్చుకొని జీతమియిచ్చి యెల్లాగో బి. ఎ. అనిపించుకున్నాడు. కాని బి. ఎ. కి పూర్వం ఉన్నగౌరవ ఆదరణలు ఇప్పుడు లేవు. సర్వం తగలేసుకొని చదివి డిగ్రీ సంపాదించుకుని, చంకనెట్టుకొని చవట నౌకరీలకుకూడా సర్వసిద్ధంగా యున్నారు. ఇల్లాయున్నా పిల్లనిస్తామంటే కొల్లలుగా తెల్లబిళ్లలు కావాలి.

మన మాధవుడట్టి బి. ఎ కాదు. విజ్ఞానశాలి. గుణవంతుడు. యోచనపరుడు. చదువుని సార్థకపరచిన వాడు. మాలతిని కొబ్బరిబొండంతో కన్యాదానం స్వీకరించాడు. కాని, కాపురానికి భార్యవస్తే గడిచే ఎత్తు చూసుకోవాలి. బడాయికిపోక ఎల్లాగో గొప్ప వారి నాశ్రయించి, కలక్టరు కచ్చేరీలో గుమాస్తా గిరి సంపాదించాడు. నెలకు ముప్పైరూపాయిలు జీతం. బ్రతుకుజీవుడా అనుకొని, రెండేండ్లయి, రజస్వలై పుట్టింటబడియున్న మాలతిని కాపరానికి తీసుకొచ్చాడు. మాలతీ మాధవు లేకలతలులేకుండా, శుకదంపతుల్లా కాపరంచేస్తున్నారు.

ఇక మన సుశీలమ్మ సంగతి. సుశీల ఆగర్భ శ్రీమంతురాలు. సిరిసంపదలతో తులతూగుచుండే శాంతమ్మకొడుకు ఐ. సి. యస్. పరీక్ష ప్యాసైయున్న సుందరరావుకిచ్చి, వేలకువేలు అడక్కపోయినా కట్నమిచ్చి, శాంతమ్మ హోదాకు తగ్గ లాంఛనాలిచ్చి, తూగకలిగిన వాళ్లగుటచేత, మహావైభోగంగా పెళ్లిచేశారు శ్రీనివాసంగారు. ఇద్దరూ బుద్ధివైభోగాల్లో సమానులగుటచే ఏ కలతలులేకుండా సుశీల సుందరరావుల పెండ్లైంది. మెరకనీరు పల్లానికే, పల్లంనీరు పల్లానికే అన్నట్లుగా లక్షణవంతుల్నే లక్ష్మి ఆశ్రయిస్తుందట.

సుశీల పాదఫలమని చెప్పవల్లులేకుండా ఆమె కాపరానికి వెళ్లకపూర్వమే సబుకలక్టరు హోదా వచ్చింది సుందరరావుగారికి. సుశీల అదృష్టం, శాంతమ్మ కడుపుచలవ, రెండూకలిసి ఆరోగ్యభాగ్యాలు ఏక మయ్యాయి. విష్ణువు లక్ష్మీపతి భాగ్యపతి. సుశీలకు పేర్లుతేడేకాని, లక్ష్మీ విష్ణువుల్లాగ కపోత దంపతుల్లాగ యీడుజోడుగా ప్రకాశిస్తున్నారీజంట.

రాజమండ్రీకి వేశారు సుందరరావుగారిని. మాధవుని గుమాస్తాపనికి మెచ్చి క్రమంగా హెడ్డు క్లర్కు పోష్టిచ్చారు. ఆయేడు కాంగ్రెసుమంత్రుల మంత్రాంగములో యున్నది పవరు. ఆరోజుల్లో ఖద్దరు కలక్టరుకూడా కట్టుకున్నారు. ఖాదీనిషేధము కాంగ్రెసుకులేదు. వారి గవర్నమెంటుకి లేదు. క్రమంగా మాధవుని తెలివితేటలు సుందరరావుగారి నాకర్షించాయి. తనక్రింద హెడ్‌క్లర్కుగా చేర్చుకున్నారు మాధవుని.

కాకినాడలోయున్న మాలతీ మాధవులు, రాజమండ్రి చేరారు. చిన్నయిల్లు అద్దెకితీసుకొని అప్పు సప్పులు లేకుండా తమ జీతానికితగ్గ ఖర్చు వెచ్చాలు చేసికొంటూ కాలం గడుపుచున్నారు. సుశీలా మాల తులు ఎవరి అత్తవారిళ్లకు వారేగింది లగాయితు యింతవరకు తిరిగి కలిసికోలేదు.

కలక్టరుగారికి గుమాస్తాలకు పరిచితియుంటుంది కాని కలక్టరుగారి భార్యకు, గుమాస్తాల భార్యలకు అంతరువు అధికం గనుక, యెరిక యెక్కడనోకాని యుండదు. భోగ్యానికి భాగ్యానికి యెంచుకునేవాళ్లకే యీ తేడా పాడాలుకాని, మనస్సే ముఖ్యమని యెంచే సుగుణశీలులకీ భాగ్య భోగాలొక లెక్కకాదు. ఇందులో చేరింది సుశీలగనుక తనయింట యే వేడుకవచ్చినా, తమ గుమాస్తాలని, భార్యలనుకూడా ఆహ్వా నించేది. తాను వారిళ్లకు వెళ్లేది. ఆదర్శప్రాయ.

అప్పట్లో ఆమెయింట కుమారుని పుట్టినరోజు సంబరంచేసారు. గొప్పవారిని, కొద్దివారినికూడా స్వంతంగానే పిలుచుకుంటుందా సుశీలమ్మ. ఆ అలవాటునే, తమ హెడ్‌క్లర్కు పెళ్లాన్నికూడా పిలవడానికి కారుమీద వెళ్లింది. కారు తమ గుమ్మందరినాగడం యిదే మొదటిసారి మాలతికి. తీరికసమయంలో రాట్నం త్రిప్పుకుని నూలుతీసుకుంటూన్న మాలతి, కారాగుటచూచి, ఏదో బెదురుపడిందో, ఎందుకాగిందో తెలియక తనపనిలో నిమగ్నయై రాట్నగీతంలో మైమరచి, లక్ష్యమంతా దారం తీసేవడుపులో యుంచుకొని, సన్నని కోకిలస్వరంతో "రాట్నమే మన మూటయనుకొండీ! రత్నాల ఏకుల రాట్నమే మన జీవగతియండీ!" అని పాడుకొంటూంది.

సుశీలాదేవి, కలకల్లాడుచు,గలగల్లాడుచు జరీ బుటేదారి పనిచేసిన పాలపిట్టరంగు బనారసుచీరతో, నవ్వు మొగంతో నాదవినోదియగు మాలతికి ప్రత్యక్షమైంది. మాలతి తలెత్తిచూసి చకితయై కొంతసేపు కొయ్యబొమ్మలాచూస్తూ నిలచి, గొప్పవారెవరో వస్తే ఆహ్వానించకుండా యిల్లా నిలబడ్డానేమనుకొని గబ గబ మూలనున్న చాపతెచ్చివేసి కూర్చోమని వేడుకొంది. సాక్షాత్తూ లక్ష్మీదేవియే తనమనస్సు పరిశీలించ డాని కీలా వచ్చిందేమోయని యనుమానించి, వినయంగా చూస్తూ నిలబడియుంది.

మార్పేమీలేని మాలతి నిట్టే ఆనమాలుపట్టింది సుశీల. తనచెలి దేశసేవా దురంధరత్వానికి, శాంత జీవనానికి సాత్విక దృష్టికి ముగ్ధురాలైంది. తన బాదరబందీకి, చెలి నిశ్శబ్ద గృహానికి తావేలు చూచుకుంటూ

తా వచ్చినపని మరచిపోయింది. పదినిమిషములట్లే మైమరచి, నిలబడుకొందుకమ్మా! ఇటు కూర్చోండీ అని మాలతిని తన చెంత కూర్చోబెట్టుకొని, ముఖానికి బొట్టుపెడుతూ 'మాలతీ! మా అబ్బాయి పుట్టినరోజు రేపు మాయింటికి భోజనానికి, పసుపు బొట్టు తాంబూలాలికి రావలిసుమా!' అని సంబోధించింది.

మాలతి కింకా ఆశ్చర్యమెక్కువైంది. మనస్సు కలవళపడుతోంది. ఎంత జ్ఞప్తికి తెచ్చుకున్నా ఆ వజ్రాలంకారాలమధ్య, ఆ జరీచీరమెరుగుల్లో ప్రకాశిస్తున్న, తన బాల్యచెలి సుశీలను పోల్చలేక తెల్లబోయి చూస్తూ, 'అల్లాగేనండీ' అందెల్లాగో మాటతెచ్చుకొని, కాని ఈవిడనెక్కడో ఎప్పుడో చూసినముఖంలా యుందని అనుమానిస్తూ, ఎవరా! అని ఆలోచిస్తూ, తాంబూలం కుంకంబరిణి తేవడానికి లోపలికెళ్ళింది. మాలతితో సుశీలకూడా వెంటాడిందింట్లోనికి. కూడా వచ్చిన బృందమంతా మన కలక్టరుగారి భార్యకీ పేదరాలేమి బంధువా! యని వితర్కించుకుంటూ విభ్రాంతులై చూస్తున్నారు.

'మాలతీ! నన్ను మరచిపోయావా?' అంది సుశీల. వెనుకనుండివచ్చిన శబ్దానికి మాలతి విభ్రాంతయై వెనుదిరిగి చూచింది. 'నేను సుశీలనుకానా మాలతీ, అప్పుడే మరిచిపోయావా?'అంది తిరిగి. మాలతిమనస్సు అప్పటికి కుదుటపడింది. ఇదేమిటి అంతా తల్లక్రిందులు! ఐశ్వర్యవంతులు నిర్భాగ్యుల్ని మరుస్తారంటారు. నాయెడ్ల అది తారుమారైందేమిటి? రూపం మారింది. భాగ్యంతో అందచందాలెక్కువైయాయి. మార్పుచేత నాబాల్య చెలిని ఆనమాలు కట్టలేకపోతిని. పైవాళ్లువింటే ఏమంటారు? అన్నీయున్న ఆమె యిట్లే పోలిక పట్టి పలకరించింది. కాని, ఏమీలేని ఆవిడ కింత మైకమెల్లాకలిగిందో అని నవ్వుకుంటారేమో, ఎంతపని జరిగిందని, ఖిన్నురాలైంది. కాని ఏమని పల్కరిస్తుంది? పూర్వస్నేహాన్నిపట్టి సుశీలా నువ్వంటుందా? హోదాను పట్టిన్ని పైగా తమ కధికారిణి యగుట మీరంటుందా? మళ్లీ చిక్కులో పడింది. 'క్షమించండి సుశీలగారు!' అంది, ఎల్లాగో ప్రాణాలు బిగపట్టుకొని. అంత సుశీల కౌగలించుకుని, 'ఏమండీ ఏమిటి మాలతీ! నీ నా స్నేహబంధం ముఖ్యంగా ఎంచుకొని మన్నించుచున్నావు. మా హెడ్ క్లర్కుగారి భార్య చాలా యోగ్యురాలని విద్యావతియని వింటూ చూచిపోదామని అనుకుంటూ యీ పిలుపు కారణంకూడా కలిసి వచ్చుటచేత యీలా రావడం, మా మాలతే మా గుమస్తాగారి భార్య అవడం, ఈరీతిగా దైవానుగ్రహం వల్ల తిరిగి కలిసికోడం కలిగింది. మాలతీ నీవు నీభర్తగారు తెల్లవారేసరికే మాయింటికి రావాలిసుమా! కారంపుతాను. ఆంతర్యంలో నీకు నాకు భేదంలేదు గనుక నాయిల్లు నీయిల్లులాగే భావించి చనువుగా రాకపోకలు చేస్తుండాలి. తప్పకుండా రావాల'ని మరీ మరీ చెప్పి, బొట్టూ తాంబూలం అందికొని సుశీల వెళ్లిపోయింది.

మాలతి సంతోష మింతింతకాదు. రాట్నం మూలపెట్టేసింది. మొగుడొచ్చేసరికి వంటచేసేసింది. పనులన్ని ముగించుకొని, తీసిన దారమంతా రెండు నూలుదండలుక్రింద కట్టింది. అదివరకు తను స్వంతంగా వడికిన నూలుతో నేయించి తెప్పించియుంచిన అరవైనెంబరు కొచ్చిన గుడ్డతో, తనస్వంత మిషనుపై ఒక చొక్కా, ఒకలాగు కుట్టింది. ఒకటోపీ కుట్టింది. చరకాధారంతో అల్లిన బనియను తీసింది. నాల్గుమూర్తులు దారందండలతో కలిపి చిన్నచేతిపెట్టెలో పెట్టింది. తన సాత్వికరూపానికి తగ్గ ఖద్దరు తెల్లచీర ఎర్రంచుదితోపురవిక బైటపెట్టుకుంది. నవ్వుముఖంతో నట్టింట నిలబడి నాధునిరాక కెదురుచూస్తోంది.

ఇంతలో ఆరుగంటలైంది. ఆఫీసుపనితో అలసి మాధవు డింటికొచ్చాడు. మాలతి ఎదురువెళ్లి చొక్కాకండువా లందుకుంది. దాహమిచ్చి, మగనికి ముఖం కాళ్లు కడుక్కునేటందుకు నీళ్లిచ్చి, అలసట తీర్చింది. ఫలహారాలుచేయని పతికి పెందరాళ భోజనంపెట్టి, ప్రక్కన కూర్చుని మధ్యాహ్నం జరిగిన సంగతంతాచెప్పి మాధవుని ఆశ్చర్య సముద్రంలో ముంచింది. ఒక్కయూరివారు, బాల్యచెలులు, అదృష్టంలో ఎవరికెవరు కర్తలు? అయినా తమ కలక్టరుగారి భార్య నిగర్వచూడామణి అని, బీదసాద హోదాల తేడా లెంచకుండా అందరిని సమానంగా గౌరవిస్తుందని, వింటున్న మాధవుని వినికిడి నిజమైంది, తన పెళ్లాం పట్ల. "ఇప్పటివాళ్లు ధనదాసులు. పెద్దచీరలు,చాలా నగలు పెట్టుకున్నవాళ్లనైనా గౌరవిస్తారు. లేక,టిక్కుటాక్కుమంటూ, కాళ్లకుజోళ్లు కళ్లకు స్పెక్టికల్సు, చేతికి రిష్టువాచి, మెళ్లో నెక్ లేసొకటివేసుకొని ఇంగ్లీషు మాట్లాడుచూ పకపకనవ్వుచూ, స్నో ముఖాలు వెలవెల్లాడుకుంటూ కుంకంబొట్టుకు నోచుకోని నవనాగరికబృందాలనైనా గౌరవించి షేకుహాండులిస్తారు, కాని మధ్యరకం సనాతనాచార పసుపుపూత కుంకంబొట్టు పేద ముత్తైదువుల నెవరూ గౌరవించరు. ప్రత్యేకించి పల్కరించరు. నలుగురిలో నారాయణా యంటూ ఓమూల కూర్చొని యిచ్చినమట్టుకు అందుకొని చక్కారావడమే కలుగుతూంటుంది. మా కలక్టరుగారి భార్య యిట్టివారిలో చేరదు."

"అశాశ్వతమగు ఐశ్వర్యమదాంధత ఆమెవద్దలేదు. అందరూ తనింటికే రావాలని అనుకోదు. భగవంతుని సర్వసమానసృష్టిలో కర్మకారణంకాని, కష్టసుఖాలకి, భాగ్యభోగాలకి కర్తలెవరన్న విజ్ఞానవిదుషి. సార్థకనామధేయ.

తెల్లవారింది. మాలతీమాధవులు కాలకృత్యాలు దీర్చుకొన్నారు. ఉన్నంతలో వేషాలుధరించి సిద్ధంగాయున్నారు. ఆనాడు విజయదశమి పండుగగూడాను. అంతకుముందునుంచి కలక్టరుగారింట్లోను దేవీనవరాత్రులు చేస్తున్నారు కాని, ఆడపిల్లలు లేనందున బొమ్మలకొలువులు, పేరంటాలులేవు. అబ్బాయికా దశమిరోజునే పుట్టినపండుగగుట, ఆవేడుక చేసుకొనుసందర్భంలో ఊరంతా ఉగ్గళించింది సుశీలమ్మ. ఆవేళ వేడుక సందర్భాలు, గొప్పయింటివి వర్ణించాలంటే చాలా పేజీలవుతాయి. అందరికిట్టివి అనుభవనీయమగు నవే గాన, ఊహించుకొంటే కథ పూర్తికి ధన్యవాదాలుచేస్తాను.

మధ్యాహ్నం, పేరంటాండ్రమధ్య నా పంచవర్షప్రాయ బాలుం డందరికి ఆకర్షణీయుడై చుక్కల్లో చంద్రుడులా వెల్గిపోతున్నాడు. ఆ బుటేదారి పనిచేసిన ముఖమల్ డ్రస్సులోనుంచి ఆశీర్వాద అక్షతలు పడ్డాయి. మగువల మంగళారతులయ్యాయి. ధనవంతుల నజర్లు, ఒక్కటీ సుసీల స్వీకరించలేదు. నమస్కారపూర్వకంగా, ముత్తైదులమధ్య నిలచింది సుసీలమ్మ. 'అక్కలారా!'అని సంబోధించింది. "వివాహోపనయన, బారసాల, పుట్టినదినం, తొట్టిల్లోపెట్టు, రజస్వలాదిక సంబరాల్లో యిల్లా తగువులు తెచ్చే ఆచార మిదివరలో గణనీయమే. కాని, ప్రస్తుత దేశ దుర్భర పరిస్థితుల్లో యిట్టి పాత ఆచారాల్ని, ధనసంబంధమైన సకలాన్ని ఖండించితీరాలని నా ప్రార్థన. 'తెచ్చినవి తిరుగకొట్టారు. వీరి గొప్పతనానికి తగవేమో'యన్న దురాలోచనకు పోవలదని నా సోదరీమణులను వేడుకుంటున్నాను. లోతుగా ఆలోచిస్తే, ఇట్టి ఆచారము, అనేక పేదలకు దుఃఖహేతువు. సంతోషపరిస్థితులకు దూరముచేయును. నజర్లు తేలేక ఎంతమందో వేడుకలుచూచు ప్రాప్తికి దూరులై దుఃఖం పొందుతారు. తెస్తే వారిగొప్పకు తగదేమో అన్న పీకులాట. వాళ్లు తెచ్చారు, మనం తేలేకపోయాం కదా యన్న వేదన. యిన్ని అవస్థలు కలిగించే యీ ఆచారం యీ బీద బానిసదేశం లోంచి మనమంతా ఏకీభవించి తరుమకొట్టాలి. గనుక మీరు తెచ్చిన విప్పట్లో నేను పుచ్చుకొన"నని ఘంటా

పథంగా చెప్పి తానిచ్చే పండ్లు, తాంబూలం వాయినాలతోపాటు ఎవరి తగువులు వారికిచ్చేసి మాటలతో వారిని మనోనిర్మలులచేసి సంతోషపెట్టి పంపించివేసెను.

ఇక మన మాలతి తాను తెచ్చిన ఉడుపులెట్లిస్తుంది? అయినా ఇది తగువుకాదని ధైర్యం చిక్కబట్టి బాలునిఒళ్లో యుడుపులుంచి మెళ్లో ఖద్దరుదండవేసి ఆశీర్వాదపూర్వకంగా అక్షతలేసి 'కలక్టరుగారి అబ్బాయికీ ఖద్దరు యుడుపులు 'దసరా బహుమాన'మని చెప్పి అర్పించెను. వెంటనే సుశీల తమ బాలునికా దేశభక్తిచిహ్నమగు ఖద్దరుబట్టలువేసి, భర్తకు చూపించి కాంగ్రెసు కలక్టరుగారి అబ్బాయికి మా చెలి తెచ్చిన దసరా బహుమానమని మేలమాడెను. మరునాడే హెడ్ క్లర్కు క్యాంపుక్లర్కుగా మారిపోయెను. ఏయూరు వెళ్లినా పాతచెలులు జంటజోళ్లు విడవకుండా తిరుగుచున్నారు.

---

# *కన్నీరు

మృతుడగు నామెభర్త గొని మిత్రులుతెచ్చిరి-యొక్క బాష్పమేన్
పతితముకాదు, రోదనము బద్ధగళమ్మును వీడ దాపతి
వ్రత కనుగొంచునుండె తుదివాని- "నిక క్షణమూరకొన్నచో
ప్రిదులును గుండె యీమె" కని ప్రేమచెలుల్ గుసవోయి రందరున్.
పొగడిరి వాని సద్గుణముప్రోవని, ధీరవరుండటంచనిన్
తగిన వరుండటం చతి యుదారస్వభావవు వైరి యంచు స్వా
దుగతి వచోవిశేషముల, తొయ్యలిమాత్రము జెప్పవాల్ప దిం
తగ చలియింప దందరు వ్యథా భర తాప నిమగ్నులై కనన్.
మెల్లగవచ్చి యొక్కసఖి మిన్నక వీరుని మోముదమ్మిపై
వల్లెదెమల్చె గాని, కని భామిని యేడ్వదు మూర్ఛయైన పో
దుల్లములోన నేమితలపో! చెలులందరకామె యున్కిపై
చెల్లినదాస! చిత్తము కృశించి గుభిల్లున గుండెవ్రీలునో!
అనుభవశాలి యొక్కముసలవ్వ కుమారుని దెచ్చి కౌగిటన్
జొనిపిన పాపమాపడతి జోరున వచ్చిన స్వాతివానగా
ననునయవాక్యముల్ వినక హా యని యేడ్చె యెడంద చుల్కగా
కనుగవ నశ్రువుల్ తొలగి కాల్వలుగట్టగ! "తీయనయ్యయో
తనయ! నినుంగురించి యికదక్కితి భూమిని! చచ్చిపుట్టితిన్!"

సామవేదుల చిరంజీవమ్మ.

---

* ఇంగ్లీషులో టెన్నిసన్ కవిదికాబోలు "హోమ్ దే బ్రాట్ హర్ వారియర్ డెడ్" అను పద్యము నకు అనువాదము.

# అంజనాదేవి ఆదిఆంధ్ర బాలికా వసతిగృహము,

## బెజవాడ

### అభివృద్ధికి ప్రజాదరణ, స్థానికసంస్థల - జిల్లాబోర్డుల ఆదరణ కావాలి

శ్రీ అంజనాదేవి ఆదిఆంధ్ర బాలికా వసతిగృహము ఉన్నది కూర్మయ్యవీధి, ఏలూరురోడ్డు, గవర్నరుపేట, బెజవాడ. ఈ వసతిగృహము 1929 సంవత్సరములో కీ॥ శే॥ ఊదా వెంకయ్య, వేముల కూర్మయ్య, (ప్రస్తుత కార్యదర్శి) గారలచే నెలకొల్పబడి, నేటివరకు జయప్రదముగా జరుగుచున్నది.



శ్రీమతి వేముల శ్యామలాదేవి

వసతిగృహపు గౌరవ సూపరింటెండెంటు.

ఈ సంవత్సరము చాలామంది బాలికలను వసతి గృహములో చేర్చుకొనినారు. ఈ గృహములో 4 వ ఫారము, 3 వ ఫారము, 1 వ ఫారము, 1 వ తరగతినుంచి 5 వ తరగతివరకు, కాలేజిలోనున్నూ చదువుచున్న బాలికలున్నారు. గత సంవత్సరమునుండి ఒక బాలిక యల్. ఐ. యమ్. చదువుచున్నది.

ఈ వసతిగృహారంభమునుండియు ప్రతి సంవత్సరము శ్రీ చల్లపల్లి రాజావారు రు 100 లున్నూ, ముఖ్యముగా బెజవాడ నగరమందలి బియ్యపు ఫ్యాక్టరీలవారున్నూ, యింకా హరిజనాభిమానులును నెలవారీగా చందాల రూపేణ యీ వసతిగృహమునకు సాయమొనర్చుచున్నారు. కృష్ణాజిల్లా కలెక్టరు, అనంతపూరు జిల్లాకలెక్టరు టి. భాస్కరరావునాయుడు గారు నెల 1 కి రు 5 లు ఇచ్చుచున్నారు.

జిల్లాబోర్డువారు, బెజవాడ మ్యునిసిపాలిటీవారు విరాళముల నిచ్చుచున్నారు. మద్రాసు ప్రభుత్వము లేబరు డిపార్టుమెంటువారు నెల 1 కి రు 5 చొ॥ బోర్డింగు గ్రాంటు యిప్పించుచున్నారు.

ఈ వసతిగృహమును స్థాపించుటలో సర్వవిధముల తోడ్పడి కొంతకాలము నెలకు రు 20 చొ॥ సాయముచేసిన శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు స్వర్గస్థులైనందులకు చాలా పరితాపము వెల్లడించవలసియున్నది.

కాంగ్రెసు నాయకులు, మాజీ ప్రధానియగు శ్రీ సి. రాజగోపాలాచారిగారు, భారతదేశములో యిటువంటి గృహము హరిజనులలో స్థాపింపబడినది లేదని ప్రశంసించియుండిరి. శ్రీ ఠక్కరుబాబాగారును (అఖిలభారత హరిజనసంఘ కార్యదర్శి) ఈ గృహమును ప్రశంసించియుండిరి.

ఈ వసతిగృహమునకు 50 రూపాయలు అద్దె ఇచ్చుచున్నారు. ఇంకను యింతకంటె యెక్కువమంది బాలికలను చేర్చుకొనుటకు ఆకర్షణీయములైన పద్ధతులలో నడుపుటకు నిశ్చయింపబడినది. గాన సర్వజనులు అన్నివిధముల హరిజనాభివృద్ధికిని, స్త్రీ విద్యాభివృద్ధికిని తోడ్పడవలయునని మనవిచేయుచున్నాము.

స్వంతభవనము యేర్పాటుగావించుటకు శ్రీ వేముల కూర్మయ్యగారు ప్రత్యేకకృషిసల్పిన తదుపరి ప్రభుత్వమువారు అన్నదానసమాజము రోడ్డుప్రక్క నొక పి. డబ్ల్యు. డి. స్థలమును గ్రాంటుచేసిరి.

—చల్లపల్లి రంగారావు.

4-49

# పంజరంలో చిలక



శ్రీమతి
కామరాజు
మైత్రేయి



మొదటినుంచి 'ఆడపిల్ల' అని పరాయిగానే వాడ్తారు. స్త్రీకి మొదటినుంచి పంజరమే గతి. బాల్యములో తల్లి దండ్రులవద్ద, యౌవనంలో భర్తదగ్గర, వృద్ధాప్యంలో కొడుకులవద్ద వారి జన్మ గడవాలి...ఆర్థికంగా స్వాతంత్ర్యము వుంటేనే కాని, అది స్వాతంత్ర్యమనిపించుకోదు.

'ఏమండీ సుబ్బమ్మగారు, మీయింట్లో పురుడు వచ్చిందా?'

'వచ్చిందమ్మా'

'ఏమి బిడ్డ?'

'ఆ—ఆడపిల్ల.'

ఇలాగని పుట్టుకతోనే మన స్త్రీజన్మ హీనతతో ఆరంభమవుతుంది. స్త్రీ శిశువు పుట్టినదగ్గరనుంచి, ఎవరో ఒక భారము మన నెత్తిమీద పెట్టినట్లు దానిని యెంత త్వరగా తీరిస్తే యంత మనశ్శాంతిగా వున్నట్టు అనుకుంటారు. 'ఆడపిల్ల పుడితే ఒకబిరుదు తెగగొయ్యమన్నా'రని సామెతెగూడ వుంది. మగపిల్లలున్నవారిని చూస్తే 'నీకేమమ్మా అదృష్టవంతురాలివి, లక్షణంగా అంతా మగపిల్లలు, నీకేం దిగులు' అని కూడా అంటారు. అట్లా అనడములోనే తెలుస్తుంది ఆడపిల్లలున్నవారి హృదయము. చాలమంది యిటువంటిది నిజమని ఒప్పుకోకపోవచ్చు, కాని అందరిలో సామాన్యముగ వుండే భావము యిది. అందుకనే మొదటినుంచి 'ఆడపిల్ల' అని పరాయిగానే వాడ్తారు. స్త్రీకి మొదటినుంచి పంజరమే గతి. బాల్యములో తల్లిదండ్రుల వద్ద, యౌవనంలో భర్తదగ్గర, వృద్ధాప్యంలో కొడుకులవద్ద వారి జన్మ గడవాలి.

స్త్రీని మొదటినుంచి పంజరములోపెట్టి చూచి ఆనందించడమే పురుషుల వంతు. వారు స్త్రీలకు స్వాతంత్ర్యము యిస్తున్నాము, సమానహక్కులు యిస్తున్నాము అని ధణువులదిరేటట్టు ప్లాటుఫారములమీద సింహగర్జనలే తప్ప, యింతవరకు క్రియ శూన్యముగనే వున్నది. పురుషులకుగాని స్త్రీలకుగాని ఆర్థికంగా స్వాతంత్ర్యము వుంటేనే కాని, అది స్వాతంత్ర్యమనిపించుకోదు. ఆర్థికంగా ఒక్క పైసాఅయినా లేనిదే, సమానహక్కులు, స్వాతంత్ర్యము ఏమి రాణించవు. 'ఎక్కడైనా బావకాని, వంగతోటవద్ద మాత్రము కా'దన్నట్లు చేత పైసాలేకుండా మిగతా ఎన్నివున్నా లాభంవుండదు, గౌరవము వుండదు.

పురుషులు, స్త్రీలను మేము మీకు కావలసిన నగలు చేయిస్తాము, చీరలు కొనియిస్తాము, యింత కంటె మీకు ఏమికావాలి? అంటారు. పైగా మిమ్ములను గృహాలకు రాణులను చేస్తాము. 'గృహలక్ష్మి' అంటే మీకేకదా చెల్లుతుంది. అని ఏవేవో కల్లబొల్లిమాటలు చెబుతారు. దీనికే స్త్రీలు వుబ్బిపోతారు. ఇంకా మేము డబ్బు సంపాదించటము మీకేగదా! మీచేతికి యిస్తున్నాముకదా! అనికూడ అంటున్నారు. ఇది కొంతవరకు నిజమే కావచ్చు. కాని ఎంతమంది పురుషులు యిట్లా చేస్తున్నారు? కొందరి యిండ్లలో

ఏ చిన్న వస్తువు కొనడానికైనా మగవారిని డబ్బులు అడగాలి. కానీ వస్తువైనా కొనడానికి స్వాతంత్ర్యము లేనివారు ఎంతో మంది వున్నారు.

అసలు స్త్రీలకే చాలమందికి తమకెలాంటి స్వాతంత్ర్యము కావాలో తెలియదు. రెండు మూడు తడవలు భర్త తోటో ఏ సినిమాకో, ఏ షికారుకో తీసికెళ్ళి నలుగురు స్నేహితులతో పరిచయము కలిగించగానే, తమకు పురుషులతో పాటు సమానత్వము, స్వాతంత్ర్యము వచ్చినవనుకొని సంతోషిస్తారు. అప్పుడు, పంజరములో చిలకను, కొంతసేపు పచ్చటి చెట్లను నీల ఆకాశమును చూస్తేనే స్వేచ్ఛ వచ్చిందనుకుంటుంది పాపం.



మనకంటే, కూలినాలి చేసుకొనే స్త్రీలే నయము. వాళ్ళకు ఆర్థికంగా సమానత్వము వుంది. ఏదోవిధంగా వాళ్ళు స్వతంత్రించి జీవనము చెయ్యగలరు. ఇంక మనము ఎన్ని కష్టాలు పడుతున్నా 'గౌరవంకోసము' అనే మిషతో, ఆర్థిక స్వాతంత్ర్యము లేనందువల్ల భరిస్తూవుండవలసి వస్తున్నది. అంటే యిప్పుడు మనకు ఆర్థికంగా స్వాతంత్ర్యమువస్తే యిప్పుడు వుండే సంసారాన్ని, పరిస్థితులను సరిగా దిద్దుకోవడము చాల తేలికపోతుంది.

మనలో ఎంతమందికి, శాస్త్రరీత్యా మనకు కుటుంబ ఆస్తులలో వుండే హక్కులనుగురించి తెలుసును? మనకు పుట్టింట కొన్ని హక్కులు, అత్తింట కొన్ని హక్కులు వున్నాయి. మనకు పుట్టింటిలో పెళ్ళి అయ్యేవరకు పోషింపబడటం, తర్వాత పెళ్ళి ఖర్చులు వగైరాలకు కుటుంబ ఆస్తిలో హక్కు వుంది. తల్లిదండ్రులు లేకపోయినా అన్నదమ్ములైనా మనలను సంరక్షించి పెళ్ళిచేసేవరకు మనకు ఆ ఆస్తిలో హక్కు వుంది. సోదరులు కాదనుటకు వీలులేదు. తర్వాత అత్తవారింట్లో ఆస్తిమీద హక్కు భర్తవల్లనే.

ఈమధ్య కొందరు సంఘసంస్కర్తలు, చట్టనిర్మాతలు స్త్రీలను ఆర్థికంగా పైకి తేవలెనని, వితంతువునకు, ఆమె జీవించుకోడలికి భర్త ఆస్తిలో హక్కులు యిచ్చారు. అవి వ్యవసాయపు భూములను మినహాయించి. పాపం పిల్ల, పెళ్ళి అవసరాలలో వుండే స్త్రీలంతా వితంతువులే అనుకున్నట్టున్నారు.

'స్త్రీ ధనము' అని స్త్రీలకు పుట్టింటి వారు పసుపు కుంకుమ కొరకు యిచ్చే భూములు, తల్లిదండ్రులు కన్యాదానమప్పుడు పెట్టు నగలు, అత్తవారు పెట్టు నగలు, బంధువులు పెళ్ళిలో యిచ్చే కానుకలు యివన్నీ స్త్రీ ధనము అంటారు. ఏదైనా మనకు యెంతవరకు దక్కుతున్నాయి? స్త్రీ ధనము, మన తర్వాత మన ఆడపిల్లలకు చెందవలెనట. కాని యిలా జరుగుతున్నదా?

ఈ 'ధనమును' పురుషులు తీసికోకూడదట. శాస్త్రరీత్యా స్త్రీలు యిష్టమని చెప్పడానికే హక్కు వుంది. పురుషులైనా అప్పులు ఎక్కువై, అవి తీర్చే విధానము లేకుండా అన్నివిధాల గత్యంతరము లేకపోతే, అప్పుడు వడ్డీతో సహా తీర్చే షరతులతో తీసికోవచ్చు. అయితే అలా జరుగుతున్నదా? స్త్రీ దగ్గర కాస్త

పచ్చ పచ్చగా డబ్బుగానో, నగలుగానో కనుపిస్తే చాలు, మొదటిచెయ్యి వీటిమీదే! తమ విలాసాలకు, వ్యసనాలకు, వుంపుడుకత్తెల కానుకలక్రింద తీసికెళ్లుతారు. ఇవ్వమని అంటే పైబడి చావగొట్టి మరీ తీసుక పోతారు. ఇంతా అన్యాయము స్త్రీలకెందుకు? వాళ్ళ హక్కులు వాళ్లు తెలుసుకోనందువలనను, హిందూ సతీత్వానికి భంగము వస్తుందని తలచుటచేతను జరుగుతోంది.

పట్టభద్రలైనంతమాత్రానను, పురుషులతో చెట్టాపట్టాలు వేసుకొని తిరిగినంత మాత్రానను, సమానత్వము, స్వాతంత్ర్యము వచ్చిందనుకోవడము చాల పొరపాటు.

స్త్రీలు నగలకోసము, చీరెలకోసము మగవారిని వేధించుటకన్న తమ హక్కులను గుర్తించుకుందుకు ప్రయత్నిస్తే బాగుంటుంది. మనము మన హక్కులను తెలిసికొని చర్యతీసికోగలమని పురుషులకు అవగాహన అయితే అప్పుడే వారికి స్త్రీలను చూస్తే భయము, గౌరవము కలుగుతాయి.

అన్ని సమానత్వాలు, హక్కులు అర్థంమీదే ఆధారపడివున్నాయి. పురుషులు స్త్రీలను ఆర్థికంగాను, సాంఘికంగాను, విద్యాగంధము లేకుండాను అణచేసారు. స్త్రీకి విద్యగలిగితే తమరు శాస్త్రాల్లో, చట్టాల్లో చేసే అన్యాయమును గుర్తించి ప్రశ్నిస్తుందేమోనని 'స్త్రీ బుద్ధి ప్రళయాంతకః' అనీ, 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అనీ శ్లోకాలు విసిరారు. శాస్త్రకారులు, చట్టనిర్మాతలు వీరంతా పురుషులేగా మరి! స్త్రీలే అయితే యిలాంటి అన్యాయము జరుగుతుందా? మరి. బ్రిటిషు పాలనలాగ పురుషులు మనలను నిరాయుధులను చేసేశారు.

ఇన్ని యుగాలనుంచి అన్ని అన్యాయాలను ఓర్చారు స్త్రీలు. ఇన్ని ఏండ్లకు స్త్రీలకు కొంచెము పాశ్చాత్య గాలి సోకింది, కండ్లు విప్పుతున్నారు. తమకు జరిగే అన్యాయాలను గుర్తించుకుంటున్నారు. ఆందోళన మొదలెట్టారు. కాని ఎక్కడ ఆరంభించాలో తెలియటములేదు. అదీగాక స్త్రీలందరి సానుభూతి కలగటములేదు. ఎందుచేత? స్త్రీలందరకు సరియైన విద్యావికాసము లేనందువలన.

ఇప్పుడిప్పుడు స్త్రీలతోపాటు పురుషులుకూడ స్త్రీలకు జరిగే అన్యాయాలను గుర్తించి, తగు న్యాయము జరిగే ఏర్పాటులు చేస్తున్నారు. శాస్త్రాలు, చట్టాలు తిరగేస్తున్నారు. కాని శుభమా అంటూ వితంతువుతో ఆరంభించేరు, స్త్రీల ఆర్థిక సంస్కారము. వీటి ఫలితాలు ఏమిటో చూడాలి.

మనమే మన అభివృద్ధికి అడ్డుతగలకుండ, సంస్కర్తలు మన శ్రేయోభిలాషులైన స్త్రీ పురుషులకు చేదోడు వాదోడుగ నుండటానికి ప్రయత్నించాలి.

స్త్రీ సమాజాల్లో అందరు స్త్రీలు రవ్వల దుద్దులు, పట్టుచీరెలు, అత్తల కోడండ్ర పురాణాలు కట్టిపెట్టి, మన స్వాతంత్ర్యానికి సంబంధించిన విషయాల్ని చర్చించి, వాటి తీర్మానాలు, ఎలాంటి మార్పులు సంస్కారాలు అవుసరమో, అటువంటి విషయాల్నిగురించిన సలహాలు మొదలైనవి మనకోసము పాటుబడే స్త్రీ పురుషుల కందజేస్తే మనకు చాల లాభదాయకంగా వుంటుందని వేరే చెప్పనక్కరలేదు.

# బొమ్మల కొలువులు

శ్రీమతి మి. ర. బాయి

ఈ వ్యాసములో రచయిత దసరా పండుగ సంప్రదాయములగూర్చియు, బొమ్మలకొలువుల పద్ధతి ఆశయ పరిణామములగూర్చియు వివరించి, గృహిణులకొక హెచ్చరికను చేసియున్నారు. *

దసరాపండగ మనకు చాలా ముఖ్యమైనది. దీనికి దేవీ నవరాత్రములని, శరన్నవరాత్రములని అంటారు. ఉత్తరదేశమున బెంగాలీలు, ఓఢ్రులు, హిందూస్థానీ వారు దుర్గపూజా శలవులని అంటారు. బెంగాల్ లో, ఒరిస్సాలో, ఈ పండుగలకు నెలదినములు శలవు లిచ్చుట వాడుక. ఆఖరుకు బెంగాలీవారు నడిపే దిన పత్రికలుకూడ నాలుగుదినములు శలవు పుచ్చుకుంటాయి. బెంగాలీలు, ఓఢ్రులు దుర్గపూజా పద్ధతిని శాక్తేయ ఆచారప్రకారముగా జరుపుదురు. అనగా జంతు బలులు, పూర్వం నరబలులుకూడ ఇచ్చుట వాడుక. కాని ఆ రాష్ట్రములలో చైతన్యమతము, బ్రహ్మమతము, రామకృష్ణ మతము ఇటీవల ఎక్కువగా వ్యాపించినందున జంతుబలుల ప్రాబల్యం కొంతతగ్గినది. కాని అక్కడ మతసంబంధముగ ఏమి జరిగినను సాంఘికంగా గొప్ప ఆనందకరమైన సమయముగా ఆ రాష్ట్రీయులు వినియోగింతురు. దుర్గపూజా శలవులలో ఎక్కడెక్కడివారును తమ తమ స్వగృహములకు చేరి బంధుమిత్రులకు జాతి, మత, వర్ణ వివక్షతలేకుండ విందులుజేసి బహుమతు లిచ్చి కాలం గడుపుదురు. అది బంధు పునస్సమాగమన సమయముగ వారు భావింతురు.

ఇక మన దక్షిణ ప్రాంతములలో ఈ నవరాత్రి ఉత్సవములు జరుపు పద్ధతికిని అక్కడి పద్ధతికిని చాలా తేడాఉన్నది. ఇక్కడకూడ నిష్టాపరులు ఈ నవరాత్రములలో దేవీపూజలు శ్రద్ధాభక్తులతో జరిపెదరు. శివ, శక్తి దేవాలయములలో దేవీ నవరాత్రములు గొప్ప ఉత్సవదినములుగా నుండును.

పూర్వము ఎన్నడో మహిషాసురుడనే రాక్షసుడు అసాధారణ బలము సంపాదించి దేవతలను పీడించగా వారందరు పార్వతీదేవితో మొరబెట్టుకొనిరట. ఆమె శక్తి స్వరూపము దాల్చి ఆ మహిషాసురునితో తొమ్మిది అహోరాత్రములు పోరాడి పదవనాడు విజయముపొందెను. ఈ మహాయుద్ధము ఆశ్వయుజ పాడ్యమి నాడు ప్రారంభమయి దశమినాడు ముగిసెను. విజయము సంప్రాప్తించిన దినము కాబట్టి విజయదశమి అని పేరువచ్చెను.

ఎక్కువ నిష్ఠాపరులు ఈ పదిరోజులు దేవీపూజలు చేయుదురు. ముఖ్యముగా ఈ నవరాత్రి పండుగలు అందరికి ఆకర్షణీయంగా ఉండుటకు బొమ్మలకొలువులు ముఖ్యకారణములు. ప్రతి సామాన్య గృహములోకూడ ఈ నవరాత్రులలో బొమ్మలకొలువులుపెట్టి ముత్తైదువుల పిలచి అందరికి యథాశక్తిని

పండ్లు, కాయలు, తాంబూలములు ఇత్తురు. ఈ కొలువులుపెట్టుట అనేది ఆంధ్ర, తమిళ, కర్నాటులలోనే ఆచారముగానున్నది. కొందరు చాలా నిపుణతతో కొలువులమర్చి, వారు సంవత్సరము పొడగున చేసిన చేతి పనులను అందు ప్రదర్శింతురు. కొందరు వట్టి మేడమెట్లవలె పడికట్లు వేసి వాటిపై, తమకు సాధ్యపడినన్ని బజారుబొమ్మలు, పుదుచ్చేరి బొమ్మలు, లక్కబొమ్మలు, సెల్లులాయిడ్ బొమ్మలు, పింగాణీ బొమ్మలు, దేముళ్లవి, మనుష్యులవి, జంతువులవి, యంత్రములవి మొదలైనవి ఎన్నోరకములు వరుసగా అమర్చుదురు. కల్పనాశక్తి గలవారు వివిధరకముల ఇండ్లు, తోటలు, కొండలు, కొండలపైనుండి జలపాతములు, దీపస్తంభములు (Lighthouses) వంతెనలు, చక్కని బాటలు, తామర కొలనులు, వాటిలో బాతులీదునట్లును మొదలైన వెన్నెన్నో చేసి కొలువులు చాల ఆకర్షవంతంగా చేయుదురు. కృష్ణుడు, గోపికలు జలక్రీడ లాడునట్లు పెద్ద బొమ్మలతో అమర్చి ధనికులైనవారు మంచి వస్త్రములతోను, ఆభరణములతోను వాటి నలంకరించి రాత్రి పూట విద్యుద్దీపములతో ప్రకాశింపజేయుదురు. కొందరు పది దినములు, ఒక్కొక్కరోజున ఒక్కొక్క అవతారమువంతున దశావతార చిత్రములను ప్రదర్శింతురు. కాని యెక్కువమంది యిండ్లలో తొలుతనుండి తుదివరకు కొలువు ఒకేతీరున నుండును.

అసలు ఈ బొమ్మల కొలువులు ఎప్పుడు ప్రారంభమయినవో ఎందుకు ప్రారంభమయినవో సరిగా మనకు తెలియకపోయినను వీటి ప్రయోజనమేమో ఊహించవచ్చును. సామాన్యముగ మనుజుల దృక్కోణ భేదమునుబట్టి ఆయావిషయములు ఆయావిధములుగ నగపడును. పూర్వాచారపరాయణులనండి, కేవలం ఆస్తికులనండి, అట్టివారు చేసేపనులు సాధారణముగ ఇహపర సాధకంగానుండేటట్లు చూచెదరు. (ఇలా ఊహించడం ఒకవేళ పొరపాటయితే కావచ్చు) వారివద్ద ఏ కొద్దిపాటి బొమ్మలున్నను అవి ఏదోవిధంగా కొలువు పెట్టి, ఈ పదిరోజులు దేవికి సంబంధించిన దినములుగనుక, ప్రతిరోజు ముత్తైదువులను బిలచి వారి శక్త్యానుసారముగ తాంబూలాదుల నిత్తురు. కొందరి ఉద్దేశము ఈ కొలువులు, వివిధదేశములలో ఏటేటా అచ్చటచ్చట జరిగే వస్తు ప్రదర్శనములవంటివని. సంవత్సరమంతా గృహిణులు తమ ఇండ్లలో తీరిక సమయములలో చేసిన చేతిపనులు, అల్లికలు, కుట్లు, చిత్రపులు మొదలగునవన్నియు ఒక్కసారి ప్రదర్శింపబడిన చూచువారి కొకవిధమైన ప్రోత్సాహముకలిగి క్రొత్త క్రొత్తపనుల అభివృద్ధికి తోడ్పాటు కలుగును.

ఇప్పుడు సుప్రసిద్ధ చిత్రకారులు చిత్రకారిణులు రచించిన చిత్రములను Art Exhibitions ప్రదర్శించుచున్నారు. ఉత్తమమయినవాటికి బహుబతు లిచ్చుచున్నారు. ఆ చిత్రముల ధర అధికమైనను వాటిని కొందరు కొనుచున్నారు. పూర్వకాలములో ఈ విధముగ చిత్రకళా ప్రదర్శనములుండేవి కావు. చక్రవర్తుల వద్ద, రాజులవద్ద, గురుశిష్య పారంపర్యముగ నిపుణులైన శిల్పులు, చిత్రకారులుండేవారు. గృహస్థులుకూడ తమ శక్తి కొద్ది తమ ఇండ్లను అలంకరించేవారు. ఈ బొమ్మల కొలువులు పాతకాలపు గృహకళా ప్రదర్శనములుగ నుండినవని అనుకొనవచ్చును. కాలక్రమేణ నాగరికత (?) ఎక్కువైనకొద్ది ముద్రబొమ్మలు, బజారులలో చౌకగా లభించుచున్నందున అందరి యిండ్లలో అవే ఎక్కువస్థానము ఆక్రమించుకొనుచున్నవి.

ప్రస్తుతం మనదేశంలో జాతీయపరిశ్రమలు, జాతీయకళలు అభివృద్ధి పొందించవలెనని ఉద్యమములు నడచుచున్నవి. ఇట్టి సమయమున మనము పై దేశములనుండి వచ్చు బొమ్మలను కొలువులలో పెట్టక, ఎవరి నేర్పుతో వారు ఆయాసంవత్సరములలో క్రొత్తగా తయారుచేయు చిత్రములను, బొమ్మలను ప్రదర్శించుచు జాతీయకళాభివృద్ధికి తోడ్పడెదము గాక.



శ్రీ అంజనాదేవి ఆది ఆంధ్ర బాలికా వసతిగృహము, బెజవాడ.

శ్రీ వేముల కూర్మయ్యగారు, వారి ధర్మపత్ని (గౌరవ సూపరింటెండెంటు) పూలమాలలతో మధ్య కుర్చీలలో కూర్చొని యున్నారు.

# గ్రంథ స్వీకారము

## కర్మయోగము

శ్రీ వివేకానంద ప్రవచనము, ద్వితీయ ముద్రణము. శ్రీ మాధవ చైతన్య బ్రహ్మచారిగారిచే అనువదింపబడి చెన్నపురి శ్రీ రామకృష్ణమఠమువారిచే ప్రకటింపబడినది. 171 పుటలు, వెల అ. 12.

త్యాగసేవలను సాధనములుగాగొని ఆత్మమోక్ష జగత్కల్యాణముల నొనగూర్చుటకై శ్రీ రామకృష్ణమఠ సేవాసంఘములను దేశదేశాంతరములలో, ఖండఖండాంతరములలో స్థాపించిన యఖండ ప్రతిభాశాలి, కర్మయోగాదర్శమూర్తి శ్రీ వివేకానందస్వామి. "తమస్సునమునిగి నిర్జీవులైయున్న నాభారత సోదరులను కర్మయోగ ప్రభావముచే పునరుజ్జీవింపజేసి, స్వశక్తిపై నిల్చు ధీరుల నొనర్చుటకై మహానందముతో వేయి నరకములైన ననుభవించెద"నని ప్రకటించి కర్మరంగమున తన జీవితము నాహూతి యొనర్చిన స్వార్థరహిత కర్మాచరణ స్వరూపుడగు శ్రీ స్వామి యొసగిన కర్మయోగ మహోపన్యాసము లీ గ్రంథరూపమును దాల్చినవి.

'తన ధర్మము ననువర్తించు ప్రతివ్యక్తియు మహనీయుడే,' 'కర్మయోగరహస్యము' 'కర్మయోగాదర్శము' మున్నగు దివ్యమైన శీర్షికలతో ఈ గ్రంథరాజము కర్మయోగ తత్త్వమును సర్వజన సుబోధ మొనర్చుచున్నది. కర్మమెటుల మోక్షసాధనమో విశదీకరించుచున్నది.

"తెల్గుసేయుచో మక్కికి మక్కియన్నటుల మార్చిన కావ్యము శ్రావ్యమెట్లగున్? అను పెద్దల వచనమును పాటించితి"నని శ్రీ బ్రహ్మచారిగారు అనువాద విధానమునుగూర్చి తమ పీఠికలో వ్రాసియున్నారు. మృదుమధురమై, సర్వజనసుబోధమై, మూలమునకు ఎనయగు వీరి యనువాదము నిజముగా శ్రీ వివేకానందస్వామియే తెలుగున మాటలాడుచున్నాడాయని తోపించుచుండును. ముద్రణము ముద్దులొలుకుచున్నది.

శ్రీ రామకృష్ణమఠమువారిట్లే జ్ఞానయోగాదులను ప్రకటించి యాంధ్రలోకమునకు మేలొనర్తురుగాక!

## భారతీయ నాగరికత, అహింసాతత్త్వము

రెండవభాగము. 12 అణాలు. రచయిత: కొమాండూరి శఠకోపాచార్యులుగారు, వకీలు, కాకినాడ.

## మహాత్మాజీ

డెబ్బదియవ జన్మదిన ప్రచురణ. మూల్యము రు 1-8-0. అనువాదకుడు: ముదిగంటి జగ్గన్నశాస్త్రి గారు, బి. ఏ., పల్లెటూరు గ్రంథమండలి, తెనాలి.

## శ్రీ గాంధిమహాత్ముని సత్యాన్వేషణ ప్రబోధములు, నిర్మాణకార్యక్రమ సందేశములు

నిర్మాణకార్యక్రమ కేంద్రమువారిచే ప్రచురింపబడినది. జొన్నలగడ్డ, నరసరావుపేట పోస్టు.

## మహాత్మాగాంధి "గీతాప్రవేశికా"

వెల కానీ. మద్రాస్ దక్షిణభారత హిందీప్రచారసభవారిచే అనువదింపబడినది. జొన్నలగడ్డ, నిర్మాణకార్యక్రమ కేంద్రప్రచురణమే.

దక్షిణాఫ్రికా సత్యాగ్రహము—(ప్రథమ, ద్వితీయ భాగములు)

మహాత్మాగాంధీ రచన, అనువాదకులు: గొల్లపూడి సీతారామశాస్త్రిగారు. సూర్యనారాయణీయ గ్రంథమాల 12, 13 కుసుమములు. వెల ఒక్కొక్కటి 8 అణాలు. పశ్చిమగోదావరిజిల్లా, కొవ్వూరు, ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ ప్రచురణములు.

చలిజ్వరము; మధుమేహము; బాలెంతరోగము

డాక్టరు పుచ్చా వెంకట్రామయ్యగారు, ఎల్. డి. రచించిన 3 గ్రంథములు. ఒక్కొక్కటి 4 అణాలు.

త్రిదోషములు

గ్రంథకర్త: భాగవతుల రామమూర్తిశాస్త్రులుగారు. ఈ పుస్తకము వెల 6 అణాలు.

పై నాల్గును బెజవాడ ప్రకృతికార్యాలయ ట్రస్టువారి ప్రచురణములే.

గ్రంథాలయోద్యమము

కర్త: సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఎ. బి. ఎల్. సికింద్రాబాదు దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణము 11. వెల ఆరు అణాలు.

సోషలిజం (సామ్యవాదం)

కర్త: గొబ్బూరు రామచంద్రరావుగారు.

యం. యన్. రాయ్ (జీవితము)

రచయిత: గుండవరము హనుమంతరావుగారు.

నా కొడుకు (కథ)

కథకుడు: ధనికొండ హనుమంతరావుగారు.

పై మూడును హైద్రాబాద్ అణా గ్రంథమాలవారి ప్రచురణములలో 16, 17, 18 నంబర్లవి.

కాషాయాంబరం

చిన్ని నాటిక. ప్రచురణ: నరసరావుపేట, నవ్యకళాపరిషత్. బి. రామదాసు రచన.

ఉద్యానం (కథాసంపుటి)

రచన: పురాణం కుమారరాఘవశాస్త్రి, బి. ఎ. మాంగల్యం, ఈరయ్య ప్రేమ, క్రిస్టమస్ సెలవుల్లో, నేనూ వస్తున్నా, ఫోటో అనే 5 కథలు. వెల ఐదు అణాలు. వాడపల్లి హౌస్, బ్రాహ్మణవీధి, బెజవాడలో దొరకును.

## గోవత్సము (కావ్యము)

కవి: పువ్వాడ శేషగిరిరావుగారు, భాస్కరపురము, బందరు. కొంతారు రామారావుగారి ప్రధానాచార్యతా రజతోత్సవ చిహ్నమగు ప్రచురణమిది. మూల్యము పండ్రెండు అణాలు.

## వత్సలుడు ; వనవాటి (కావ్యము, కావ్యఖండికలు, గీతములు)

కవి: అంబటిపూడి వెంకటరత్నంగారు. సాహితీమేఖల ప్రచురణములు 3, 4 కలిసియున్న ఒకే సంపుటము. వెల ఒక్కరూపాయి. ఇనగల్లు, వయా చీరాల, గుంటూరుజిల్లాకుగాని; కోటయ్యగూడెం, చుండూరు పోస్టు, నల్లగొండజిల్లా (నైజాం) లోని సాహితీమేఖలవారికిగాని వ్రాసిన, ప్రతులు దొరకగలవు.

## సమాధి (కావ్యము)

కర్త: మంత్రిరావు సత్యనారాయణగారు. శ్రీ శివశంకరశాస్త్రిగారి పీఠిక. గుంటూరు నవ్యసాహిత్య పరిషత్తువారి ప్రచురణము. అర్ధరూపాయి.

## పాషాణి (అహల్య)

నాటకము, రచయిత: ఊటుకూరు సత్యనారాయణరావుగారు. సారస్వత చంద్రికా గ్రంథమాల, అర్లపాడు, గంపలగూడెం పోస్టు, కృష్ణాజిల్లా. మూల్యం ఎనిమిదణాలు.

## గాలి యాత

స్వానుభవపూర్వకమైన యోగవ్యాయామశాస్త్రము. శేషభట్టర్ వీరరాఘవాచార్య రచించినది. వెల 1 రూపాయి. నెల్లూరుజిల్లా, శింగరాయకొండలోని గ్రంథకర్తవద్ద ప్రతులు దొరకును.

## శ్రీ మాతృవాక్కులు

అనువాదకులు: తి. వి. కపాలిశాస్త్రిగారు. ప్రకాశకులు: చతుర్వేదుల వెంకటకృష్ణయ్యగారు, శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి. 332 పుటల గ్రంథము. వెల 1-12-0.

## సోవియట్ రష్యాలో (మొదటిభాగం)

గ్రంథకర్త: కొత్తపల్లి సుబ్బరామయ్యగారు, ఎం. ఎ., ఎల్. టి. అనంతపురం నవ్యసాహిత్యమాల 11 వ ప్రచురణం. (సెప్టెంబరు 1941). వెల 6 అణాలు.

## కాయశోధన విధానము అను పంచకర్మచికిత్స

గ్రంథకర్త: అభినవచికిత్సారత్నాకర రాంధ్ర శారీర శాస్త్రాది రచయిత, పాలంకి సూర్యనారాయణ కవి, ఉప్పాడ. వెల 4 అణాలు.



# సంపాదకీయములు

## గాంధీమహాత్ముని 73 వ జన్మదినోత్సవము

జగదేకవంద్యుడగు బాపుజీ తన ధన్యజీవితమున 73 వ సంవత్సరమున ప్రవేశింతురు. అక్టోబరు 2 వ తేదీనాడు ఈ జయంతి ఉత్సవము ప్రపంచములోని అన్ని నాగరిక దేశములలోను, ముఖ్యముగ భారతదేశము లోను అత్యంత జయప్రదముగ జరుపబడునని నమ్మెదము. పరమేశ్వరుడు గాంధిగారికి దీర్ఘాయువును, ఆరోగ్యమును బలమును ప్రసాదించి, ప్రపంచశాంతియు, భారతదేశస్వాతంత్ర్యమును సుస్థాపితముగా నేర్పడగా చూచుకొను భాగ్యమును కలుగజేయవలెనను ప్రార్థనాపూర్వకమైన ఆశను స్త్రీలోకము తరఫున 'గృహలక్ష్మి' వెల్లడించుచు, మహాత్మునకు జన్మదినాభివందనము లర్పించుచున్నది.

కారణము, విశాలమానవకోటి అభ్యున్నతికి అవసరమగు సత్యము అహింస గూర్చిన ప్రచారమే కాకను శాంతిప్రేమల వ్యాప్తికొఱకు నిరంతరము పాటుపడుటే కాకను, భారతదేశ రాజకీయార్థిక స్వాతంత్ర్య సముపార్జన ప్రయత్నోద్యమముల మూలమున, మహాత్ముడు స్త్రీలకు గృహావరణములందేగాక, విశాల జాతీయ నవజీవనమందు ప్రజోపయోగకార్యకలాపములన్నింట జాగరణము చైతన్యము కలిగించి పురుషులతోపాటు సమానహోదాను హక్కుబాధ్యతలను గుర్తెరుగ మంచి ప్రోత్సాహమిచ్చినాడు. స్త్రీజాతిలో నిహితమై నైజమైయున్న త్యాగ సహన శీలము పరాకాష్ఠను దర్శింపజేసినాడు. భారతమాత పవిత్రాత్మనే మేలుకొలిపి నాడు. రాటము మగ్గము మొదలైన వాని పునరుద్ధరణవలన, చేతిపనులు, గృహపరిశ్రమలు పునరుజ్జీవనము పొంది సౌభాగ్యకరముగ సమృద్ధిగ వ్యాపించిననాడు ప్రతిగృహిణికి నిత్యజీవనమున ఆర్థికసుస్థితి కొంతకుకొంత కలిగినదన్నమాటయేకదా. అంతేకాక, అనేక అవసరములందు అవకాశములందు, ప్రత్యేకమగు సందర్భముల లోను భారతస్త్రీకి ఎచ్చటెచ్చట ఎట్టి అన్యాయము అత్యాచారము జరిగినను మహాత్ముడు తాను చేయెత్తి ఆ బాధలను నిష్ఠురములను తొలగింప జూచినాడు. మార్గాంతరములను ఉపాయములను బోధించినాడు. తాను స్వయముగ ఎంతోమందికి వ్యక్తిగతముగ మంచి ప్రేరణను, ప్రోత్సాహమును యిచ్చి, తమ జీవితములను సార్థకములు చేసుకొన తోడ్పడినాడు. పతితల యెడలను పావనుడుగ పరిణమించినాడు. మహాత్ముడు గోమాతృసేవయందును గొప్ప విశ్వాసముగలవాడు. కదరు, కవ్వము తిరుగుచుండిన కరవు ఏటిది? అనునట్లు భారతదేశపు పాడిపంట పరిశ్రమ లన్నింటికి గొప్పగా దోహదమిచ్చి పుష్టిని చేకూర్చ, అన్నిటికంటె ముఖ్య ముగ, ఆత్మస్వాతంత్ర్యమునే చేకూర్చ, యత్నించు ప్రయత్నములో తన యావజ్జీవితమును స్వార్థ రహితముగ దేశము-దేవుడు కోసము ధారపోయుచున్న మహాత్మునకు కృతజ్ఞతాభరిత హృదయములతో అసంఖ్యాకులగు స్త్రీలు ధన్యవాదము లర్పింతురు.

## గుంటూరున స్త్రీల కళాశాల

గుంటూరు పురపాలక సంఘంవారు ఈమధ్య నొక ముఖ్యమగు తీర్మానమును ప్యాసుచేసి అభి వందనీయులయినారు.

గుంటూరు నగరములో ప్రత్యేకముగా స్త్రీలకొఱకొక కళాశాలను మ్యునిసిపల్ ధనమునుండి నిర్మించుట వీరి నిశ్చయమైయున్నది. ఇది ఎంతయు ప్రశంసార్హమగు ఉద్యమము. దీనికి ప్రభుత్వమువారు ఎట్టి ఆటంకమును అభ్యంతరమును కలిగింపక, ఆమోదింతురనియు, తమవంతు అవసరమయిన సహాయము నెల్ల చేయుదురనియు విశ్వసింతము.

అసలు ఆంధ్రదేశ ప్రాంతములో నింతవరకు ఏ జిల్లాలోను ప్రత్యేకముగ స్త్రీలకొఱకు పూర్తియైన కళాశాల యున్నట్లు లేదు. Coeducation ఇష్టములేనివారికిని, స్త్రీలకొఱకు ప్రత్యేక విద్యా సౌకర్యముల యేర్పాటు అవసరమని నమ్మువారికిని ప్రత్యేక స్త్రీ కళాశాలల అవసరము ఎంతేనియున్నది. అంతేకాక, స్త్రీల ప్రత్యేక కళాశాలలవలన యితర లాభములును మేళ్లును గలవు.

చొరవతో కూడిన యీ తీర్మానముపై, గుంటూరు పురపాలకసంఘమువారిని మేము అభినందించుచు, వారు తమ పట్టుదలను విడువక కార్యదీక్ష చూపించి, తప్పక వీలయినంత శీఘ్రకాలములోనే స్త్రీలకొఱకయిన కళాశాలా నిర్మాణ ప్రారంభము గావించి కొనసాగింపవలెనని హెచ్చరించెదము.

ఇందుకు అవసరమయినచో, గుంటూరు పౌరులును, ధనికులు ఉదారవిరాళములతో ధనసహాయము గావింతురనియు నమ్మెదము.

## కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమముకొఱకైన మదరాసు స్త్రీల సంఘము

స్త్రీలలో ఖద్దరు తత్వమును కలుగజేసి యభివృద్ధిపరచుట, మదరాసు నగరములోను పరిసర ప్రాంతములలోను చరఖా (రాట్నం) కేంద్రములను ప్రారంభింపజేసి నిర్వహించుట, కాంగ్రెసు నిర్మాణ కార్యకలాపములకొఱకు డివిజనలు సభలను స్థాపించుట, అస్పృశ్యతను అవిద్యను - తొలగింప పాటుపడుట, స్త్రీల సమస్యలనుగూర్చియు, తాత్కాలిక ప్రశ్నలనుగూర్చియు తెలిసికొనుటకును స్త్రీలకు సంబంధించినంత వరకు జాతీయనిర్మాణ కార్యవిధాన నిర్ణయసంఘ (N. P. C.) నివేదికలను తెలిసికొనుటకును, విద్యా కేంద్రములను స్థాపించుటయు, ఆశయములుగా గలిగి, కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమముకొఱకని, మదరాసు స్త్రీల సంఘము ఒకటి ఈమధ్యనే ప్రారంభింపబడి, పనులు ప్రారంభమయినవి.

సభ్యురాండ్రు కాగోరువారికి షరతులు: నిర్ణీత సంవత్సర, లేక, మాసవారీ చందాయు, స్వయముగా వడికిన నూలు చందాయును, స్వదేశీవ్రత దీక్షాపత్రముపై సంతకము, ఆచరణయు. ఈ నవరాత్రముల ఉత్సవ సందర్భములలో స్త్రీలు అనేకచోట్ల కలుసుకొని ఆనందముగ గడుపుదురు. దానితోపాటు కొద్దిగా దేశహితైక చింతనుకూడ కలిపి నిర్మాణశీలమయిన కార్యములకు తోడ్పడినచో మరింత మేలే యగునని, పై ఆశయ ఉద్దేశములకు ఆచరణతోకూడిన తోడ్పాటు ఇమ్మని, స్త్రీల సంఘ గౌరవ కార్యదర్శినులు చేసిన విజ్ఞాపనను మేము హృదయపూర్వకముగ బలపరచుచున్నాము.

## స్త్రీలు - న్యాయవాదవృత్తి

నేటి ప్రపంచమున స్త్రీలు పురుషులతోపాటు ఇంచుమించు అన్ని కార్యరంగములలోను ప్రవేశించి, పోటీకూడ చేయ నుత్సహించుచున్నారనుట ముదావహము.

భారతదేశమంతటిలోను మలయాళదేశమగు తిరువాంకూరు సంస్థానంలో స్త్రీ విద్య, స్త్రీల ఉద్యోగములు, హెచ్చుగా ఉన్నతిముఖమున ఉన్నవి. తిరువాంకూరులోనే ప్రపంచమంతటికీ ప్రప్రథమముగ స్త్రీ సర్జన్ జనరల్ నియమింపబడినది. ప్రథమ స్త్రీ సబు జడ్జికూడ తిరువాంకూరు ఉద్యోగియే. అచట స్త్రీ ప్రొఫెసరులనేకులు పురుషుల కళాశాలల నాక్రమించుకొనుచున్నారు. సహకారశాఖలోను, ప్రభుత్వ సెక్రెటరేటులోను, విద్యాశాఖలోను, విశేష సంఖ్యగ స్త్రీ లుద్యోగములు వహించియున్నారనుట అత్యంతము ఆనందదాయకము. స్త్రీ విద్యా సుపరిణామమందును, స్త్రీ ఉద్యమ సాఫల్యమందును తిరువాంకూరు ప్రాంతముదే ముందడుగు.

అయితే, ఆ ప్రాంతముననయినను, అన్ని కార్యరంగములలోను బాగా ముందుకు ఉన్నతికి వచ్చిన స్త్రీలు న్యాయవాదవృత్తియందుగాని, ప్రజోపయోగ దేశహితైక జీవనమందుగాని, ప్రత్యేక ఖ్యాతిని సంపాదించుకోజాలక పోవుటకు కారణము లేమైయుండునో? భారతదేశములోను, ముఖ్యముగ ఇంగ్లండులోను, స్త్రీలు న్యాయవాదవృత్తిలో ప్రవేశముకలిగి దాదాపు 20 ఏళ్లు కావచ్చినను లాయరువృత్తియందు ప్రతిభ చూపిన దృష్టాంతములు అరుదట. హెచ్చుగా కోర్టులవెంట తిరుగువారు, దావాదార్లు, అసంఖ్యాకముగ - హెచ్చుగా పురుషులే యైయుండినందువల్ల స్త్రీ న్యాయవాదినులకు తమకేసులు ఒప్పజెప్పుటకు వెనుదీయు టొక కారణమైయుండునేమో యని ఒక దినపత్రికవారు వ్రాసిరి. కావచ్చును.

స్త్రీలు న్యాయవాదవృత్తియందు పురుషులకు పైచేయిగా కాకపోయినా, వారితో సమానము కాగలరని ఋజువుచేయవలసిన అవసరమున్నట్లున్నది.



**Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.**